of and for providing medical facilities in the villages As we all know India is a land of villages There are 16,000 villages in our State and they have no proper medical facilities and no proper maternity medical service and health centres To day it is the duty of Government to concentrate more on village medical service Only this morning in the question hour a member drew the attention of the House to the fact that we have very few nurses and midwives, Needless to say that it is the duty of the Government that an adequate number is trained as early as possible

Then there is the Women s Welfare scheme I find some provision is made in the Plan under this head, and there are seventeen schemes proposed I know at present the scheme is working here and there I know there are Assistant Women Welfare Officers working But I do not know what functions these officers are performing I think they are more decorative than therative (Loud and continued laughter)

SRIMATHI C AMMANNA RAJA —On a point of order (Laughter)

Mr SPEAKER The hon Member is not yielding (Laughter)

SRIMATHI C AMMANNA RAJA —Are you yielding (Addressing the hon member, Sri K V Vema Reddi) (Laughter)

Sri K V VEMA REDDI - I am not yielding, (Laughter) It is not a reflection on those officers, it is not a reflection on the duties they are to perform I am only saying they have neglected their duties I only wish to draw the attention of the Government to their dereliction of duty Because some of my friends have been saying that these women welfare officers have been doing no work, and they are not of any use to the villagers I request Government to run this Women Welfare scheme on efficient lines

Lastly, Sir I wish to say one word The Hon Minister for Planning said that money and more money is required to implement the Second Five Year Plan, and for that we have to impose taxes I appeal to him to tax the rich, to tax the big landlords and not tax the poor He spoke of compulsory loans May I tell him that such a step may not be necessary if taxa

tion on proper lines is resorted I am sure the people will respond to the appeal of the Hon Minister as it is the bounden duty of every true citizen of India to work out the Second Five Year Plan I am glad the Hon Minister for Planning has assured us that another opportunity would be given to us to discuss the Plan, after he returns from Delhi so that we can put fresh proposals with reference to our respective constituencies Thank you, Sir

SRIMATHI C AMMANNA RAJA —అధ్యక్షా, శ్రీ కళా వెంకట రావుగారు మంత్రిపదవి స్వీకరించినప్పటినుండి, Planning మంత్రిగా ఉంటూ ఈ Planning విషయములో చాల శ్రద్ధతీసుకొని ఈ కొద్దికాలములో సమగ్రంగా ఒక పథకము తయారు చేశారు వారు ఈ విషయములో ఎంత శ్రద్ధ తీసుకొంటున్నది నాకు తెలుసు. వారు మినిస్టరు అయినప్పటినుంచికూడ District officers కును M L As కును మీ ఉద్దేశాలు, సలహాలు ఇవ్వమని ఉత్తరాలు వ్రాసి అప్పుడప్పుడు conferences పెడుతూ చాల కష్టపడి ఈ విధమైనటువంటి ఒక సమగ్రమైన ప్లాను తయారుచేయ గలిగారు నాకు మామూలుగా పొగడే అలవాటులేదు అయినప్పటికిని ఈ సందర్భమున వీరు ఏవిధముగా కృషి చేశారో చెప్పవలసిన అవసరమున్నదని చెప్పుతున్నాను మనము శాసనసభ్యులముకూడ వారు తయారుచేసిన పథకాన్ని సరిగా అర్థముచేసుకొని మిగతా విషయములోకూడ సలహాలు ఇవ్వవలసినబాధ్యత మన మీద ఉన్నది మొత్తము మన రాష్ట్రానికంతటికి సంబంధించినటువంటి ఒక సమగ్రమైన పథకాన్ని గురించి ఆలోచించేటప్పుడు ఎవరంతటివారు వారి వారి జిల్లాలను గురించి వారి వారి constituencies ని గురించి, మా శ్రీకాకుళము, మా పాతపట్నము, మా రాయలసీమ అనుకుంటూ ఎవరంతటవారు వారి వారి ప్రాంతాలను గురించే మాట్లాడడం అంత బాగ్యంగాలేదేమో అనుకుంటాను ఈ విషయములో సమగ్రముగా ఆలోచించవలసిన బాధ్యతకూడా మనకు ఉన్నది చాలా మట్టుకు అన్ని విషయాలనుగురించి అన్ని departmenents కూడ చాలా ఆలోచించి ఈ పథకాన్ని తయారుచేశారు అంతకంటె ఎక్కువగా చేయడానికి వీలులేదు డబ్బు ఉంటె ఎంతైనాచేయవచ్చు వారి యిబ్బందులు బాధలన్నీ కూడ ఈ సందర్భములో చెప్పారు కనుక ఇంతమట్టుకైనా సాధించగలిగితే చాల ఎక్కువైన విషయమేనని మనము అనుకొనవలసియుంటుంది చాలా మట్టుకు అన్ని విషయాలునుగురించి మంత్రిగారు దీంట్లో information బాగానే ఇచ్చినారు కాని రోడ్లు గురించి పెద్ద పెద్ద ప్రాజెక్టులుగురించి irrigation గురించి జిల్లావారిగా వివరాలు ఇవ్వలేదు అయినప్పటికి ఏజిల్లాకు ఎంత అవసరమో అనేది బహుశ ఆలోచించుకొనే వేసిఉంటారని అనుకొంటాను కాని మాకు ఒక idea లేకుండా ఉన్నది ఉదాహరణకు Highways ఇన్ని వందలమైళ్ళని ఉన్నది ఇది ఎక్కడెక్కడ ఎంత తీసుకొంటూ రనేదిచెప్పినట్లయితే దేనికి priority ఇచ్చినాని తెలిసి ఉండేది

ప్రస్తుతం నేను మాట్లాడేందుకు వెంటనే chance ఇప్పించినందుకు నేను రెడ్డిగారికి కృతజ్ఞత తెలుపుతున్నాను వారు ఇ తరుణందు మాట్లాడుతూ woman welfare officers ఏమి చేస్తున్నారో నాకు తెలియదు అని "They are more deco-

rative than useful" అన్నారో అన్నారు వారేమి చేస్తున్నది తెలియదు అన్నప్పుడు ఆ విధంగా చెప్పడం న్యాయముకాదు వారు decorative గా కన్పడు తున్నారంటే అది వారి జన్మహక్కు అది వారి తప్పుకాదు మీరుకూడ రంగుల రంగుల గుడ్డలు కట్టుకొని చాలా ప్రయత్నాలు చేస్తూ ఉంటారు అయినప్పటికిని మీరా విధంగా కన్పడకపోతే అది మీ దురదృష్టము అనేక సమపాయాలు మీకు ఉన్నాయి మాకు తక్కువ ఉన్నాయి Decorativeగా కన్పడినందువల్ల అది తప్పు అని అనుకో కూడదు. వారు పనులేవో గుర్తించి వారు duties చేస్తున్నారా లేదా ఉపయోగకరంగా ఉన్నారా లేదా, ఈ office అనేది ఉండాలా లేదా అని ఆలోచించవలసి యుంటుంది. "They are move decorative than useful" అని అనడం చాలా తప్పు అనుకొంటాను. స్త్రీల విషయం వచ్చేటప్పటికి ఒక విధంగా light hearted గా మాట్లాడడ మనేది ప్రతి విషయములోను చూస్తూ ఉంటాను అది సమంజసం కాదు.

Mr SPEAKER —Let not the remark be so sweeping

SRIMATHI C AMMANNA PAJA — అది ఎవరికి అన్వయించితే వాళ్లనే తీసుకోమ్మని కోరుతున్నాను Central Social Welfare Board తరఫున state లో ఆ పని జరుగుతున్నది వారు చేసేటటువంటి పనులయొక్క వివరాలు తెలుపునటువంటి ఒక చిన్న pamphlet దొరికింది అదే విధముగా ఈ woman's welfare department తరఫునకూడ ఇక్కడ ఎంతవరకు పనులు జరుగుతున్నాయనేం దుకు ఒక account ఉంటే బాగుంటుందను కొంటాను

The Hon Sri K VENKATA RAO —మనది కూడ ఉన్నది

SRIMATHI C AMMANNA RAJA —ఉన్నది నాకు తెలుసు ఇటు వంటి remarks వస్తాయని కూడ నాకు తెలుసు కనుక మన సభ్యులకు కూడ అటువంటి pamphlet ఒకటి ఇస్తే బాగుంటుంది వారు కూడ తెలుసు కొంటారు ఈ Women's Welfare Department లో ఏమి జరగడం లేదని general గా ఒక వ్యతిరేక భావమున్నది అది పోవాలి నిజంగా వాళ్ళు పాపము ఎంతో కష్టపడి పనిచేస్తున్నారు రెండు జిల్లాలకొక officer చొప్పున ఉంటూ transport facilities కూడ సరిగ లేకుండా అవస్థపడుతున్నారు వారికి Jeeps ఇస్తున్నారని మీరంటున్నారు వారికి అటు వంటిదేమి లేదు ఎంతో కష్టపడి గ్రామాలలో తిరుగుతూ ఉంటారు వారికేమి పెద్దజీతాలు లేవు చిన్నచిన్న జీతాలు తీసుకొని నిజమైన సేవ చేయాలనే అభిప్రాయముతో బిడ్డలకు, స్త్రీలకు కానకబడిన అజ్ఞానములో ఉన్నవాళ్ళకు సేవచేయాలనే ఉద్దేశముతో చేస్తున్నారు దీనికొన్ని centres పెట్టుకొంటున్నారు వారికివృత్తులు కల్పిస్తున్నారు Department ఏమి చేస్తున్నది తెలుసుకో దలచినవారు మంత్రిగారిని అడిగిగాని లేక library లో దీన్ని గురించిన leterature ను చదువుకొని గాని తెలిసికొని ఉండవచ్చును అంతే కాకుండా, అది వారికి చాలునని అనుకుంటాను ఈరోజున ముఖ్యంగా స్త్రీలకు, బిడ్డలకు సంబంధించినంతవరకే మాట్లాడవలెనని అనుకున్నాను కొన్ని Certified Schools కూడా పెట్టబోతున్నారు బళ్ళారిలోవున్న తెలుగువారిని అప్రభుత్వమువారు పనికిబిడ్డలుగా treat చేస్తున్నారని తెలిసింది నిజానికి వారుకూడా మన ఆంధ్రులే

గనుక వారిని కాపాడవలసిన బాధ్యత మన మీద వున్నదని అనుకుంటాను ఈ సంగర్భములో ఒక్క విషయము ఆలోచించాలి మన పిల్లలు యితర రాష్ట్రములో వున్నట్లైతే ఆ భావన అక్కడ prominence అనేది వుండ లేవుండదు అంగుచేత యిప్పుడు మనకు five year plan రాబోతున్నది గనుక యిందులో స్త్రీలకు, వారి బిడ్డలకోసం first priority యివ్వమని అంటున్నారు ఈ priority అనేది తొందరలో చేయాల్సివున్నది ఈ ప్లానులో కొంతవరకు యితర ఖర్చులు తగ్గించి, యీ స్త్రీలను, neglect చేస్తున్నారు గనుక వారిని కాపాడటానికి first priority యీ five year plan లో యివ్వమని అంటున్నాను నిజానికి స్త్రీలు నోరులేనివారుగనుకనే వారు neglect చేయబడు తున్నారని అనుకుంటున్నాను స్త్రీలు అంటె చాలా చులకనగా చూడబడుతున్నారని అందరు ఒప్పుకుంటారని నేను అనుకుంటున్నాను వారికి ఎక్కడనూ స్థానములేకుండా వుంటున్నారు ఈ అసెంబ్లీలో నేను ఒక్కదానిని అయినను నాకు గూడా అంత ప్రాధాన్యత యిస్తున్నట్లు కనబడదములేదు అంటే స్త్రీలకందరికి ప్రాధాన్యము యివ్వమని కాదు కాని వారి యొక్క interests కాపాడాలని అంటున్నాను అంటే న్యాయముగా వారికి యివ్వతగిన ప్రాధాన్యము అనగా వారికూడ యీ స్థానము వున్నది అని తలంచేమాదిరిగా యివ్వమని కోరుతున్నాను

తరువాత Central Social Welfare Board అని ఒకటి ఏర్పాటుచేశారు దానికి మన State కూడా చాలా సహాయ్యము చేస్తున్నది ఈవిషయము సభ్యులందరు ప్రశ్నల మూలంగా తెలుసుకోగలిగినారని అనుకుంటున్నాను ఈ బోర్డులో చాలా చక్కనిపని జరుగుచున్నది అందులో వారికి మంచి విజ్ఞానము, స్త్రీలు కొన్ని కొన్ని centres లో పనిచేయుడం, వృత్తులు నేర్చుకోవడం, గలంగురితో కలసి మాట్లాడడం చదువుకోవడం, మీటింగులకు వెళ్ళడం, అందులో పాల్గొనడం యీ విధముగా మంచి విజ్ఞానమును నేర్పుతున్నారు దాని మూలాన, వారు జ్ఞానము సంపాదించుకోటానికి మంచి అవకాశాలు ఏర్పడుతున్నవి

తరువాత Vigilance work చేయవలసివున్నదని చెప్పారు అందుకు Vigilance Homes, Rescue Homes యింతవరకూ మన రాష్ట్రములో లేనే లేవు అవి మన రాష్ట్రములో చాలా అవసరమైయున్నవి అవసరములేని పరిస్థితులుంటే నేను చాలా సంతోషించేదానిని కాని ఆ పరిస్థితులు ప్రస్తుతము లేవు పతితులైన స్త్రీల కోసము మనము కొన్ని ఏర్పాట్లు చేయవలసివుంటుంది సంఘములోని కొన్ని కారణాల వల్ల, ఏదోవిధంగా స్త్రీలు అనేకమంది, తప్పులుచేసో, వారంతటవారు సొసైటీలోనుంచి బైటకువచ్చో, యిటువంటివి అనేక కారణములచేత సొసైటీనుంచి బహిష్కరింపబడ్డ స్త్రీలకు Reserve Homes వుండాలి ప్రమాద స్త్రీలు వుంటే, వారికి తక్షణం కావలసిన సహాయము యిచ్చి వారిని rescue చేయాల్సి వున్నది ఇప్పటికాలములో చాలామంది సుఖములేకుండా బాధపడుతున్నారు ఇటువంటివారికి ఆ Welfare Board లో ఏర్పాటుచేసియున్నారు అదేమాదిరి మన రాష్ట్రములో కూడా చాలా అవసరముగా, వెంటనే పెట్టమని అంటున్నాను ఇటువంటిదానిలో పనిచేయుటానికి training అయిన కొంతమంది women వుండాలి అటువంటి Training centre మద్రాసులో School or College of Social Services or Social Welfare అని ఒకకళాశాల పెట్టబడివున్నది అటువంటిది ఒక Tartas లో వున్నది ఇంకా ఒకటి Baroda లో

వున్నదనుకుంటాను ఇంకొ ఎక్కడెక్కడ వున్నదో కూడా నాకు బాగా తెలియదు కాబట్టి మన రాష్ట్రములో కూడా ఒక శిక్షణాలయం తక్షణం స్థాపించుకోవలసియున్నది ప్రస్తుతము కు అగి ఏర్పాటు అయ్యేవరకున్ను, మద్రాసులో వున్నది కాబట్టి ఒక అరడజనుమంది స్త్రీలను మద్రాసుపంపి training యిప్పించి, మనము యీ Welfare Board Reserve Homes, యివన్నీ స్థాపించుకొనేప్పటికి, వారికి training యిప్పించుకొని ready గా పెట్టుకోవాల్సిన అవసరమున్నది

ఈమధ్య నేను ఢిల్లీ వెళ్ళి వచ్చాను అక్కడ Balasahayog అని ఒక institution చూచాను అందులో తలిదండ్రులు లేని బిడ్డలుగాని, యింకా వీధులలో దొంగతనాలు చేసే చిన్నచిన్న పిల్లలు, యిటువంటివాళ్ళను సుమారు ఒక నూరు నూట యాభైమంది దాకా పోగుచేసి, ఆ institution లో వాళ్ళకు అన్నిపనులు నేర్పుతున్నారు అది చాలా పెద్దభవనము అందులో Rattan work నేర్పుతున్నవాళ్ళు carpentary అని, blacksmith works అని, యిటువంటి different professions కు పనికివచ్చేటట్లుగా నేర్పుతున్నారు ముఖ్యంగా దొంగతనాలుచేసి బజార్లవెంబడి తిరిగేవాళ్ళను చాలా మంచిదైనవిషయము వారు idle గా తిరుగకుండా మంచిదారిలో పెట్టడమనే కృషి జరుగుచున్నది. ఇటువంటి institution ఒకటి చాలా అవసరమని, దాన్ని త్వరలో స్థాపించవలసిందిగా కోరుతున్నాను

తరువాత మద్రాసులో Asok Vihar అనేది ఒక institution వున్నది ఇందులో కూడా చిన్నపిల్లలకు విద్యాబోధన వర్గాలు జరుగుతున్నవి పెద్దవాళ్ళు పనికి వెళ్ళేటప్పుడు యీ పిల్లలను యిక్కడ విడిచిపెట్టి వెళ్తారు వాళ్ళకు ఆటలు పాటలు, చదువులు నేర్పించడము జరుగుచున్నది ఆ చిన్నబిడ్డలకు బట్టలు విడిపించి స్నానాలు చేయించి, పాలుయిచ్చి చదువులు నేర్పుతున్నారు ఆ విధంగా మనకు ఒక institution వుంటే బాగుంటుంది ఆ తలిదండ్రులకు యిది ఒక Community Centre గా పనిచేస్తుంది. ఇటువంటిదికూడా ఒకటి మనకు యీ రాష్ట్రములో చాలా అవసరము తరువాత Orphanage ఒకటి అవసరము వున్నది తలిదండ్రులు లేనివాళ్ళ నందరిని యిందులో పెంచి ముందుకు తీసుకొనిరావాలి వాళ్ళు పెద్దవాళ్ళు అయి, భావిపౌరులు కాబోతారు ఇందులో destitute children ను కూడా చేర్చుకోవటానికి అవకాశములు వుంటాయి ఇందాక నేను తల్లిదండ్రులు లేని పిల్లలు అంటే శ్రీ వెంకట్రావుగారు, తండ్రులు లేకుండ పిల్లలు ఎట్లా వుంటారండి అని అన్నారు నేను పిల్లలకు తండ్రులు లేరంటే తండ్రి లేకుండా, ఆర్థికస్తోమతు లేకుండా, నిస్సహాయులుగా వుండే పిల్లలు సంగతి నేను చెప్తున్నాను అటువంటివాళ్ళను కాపాడి మనము పైకి తీసుకునిరావాల్సి వున్నది

తరువాత కొన్ని Work Centres అనేవి పెట్టినట్లైతే వాటిద్వారా మనము కొంత పని చేయగలుగుతాము తరువాత nurses కు quarters లేవని నేను యిది వరకు చెప్పాను హాస్పిటల్సులో చాలా కష్టపడి పనిచేసున్నారు

Mr SPEAKER — ఆ details of the plan అన్నీ తరువాత ఆసంగతి వచ్చినప్పుడు మాట్లాడండి ఇప్పుడు ఏమైనా మాట్లాడదలిస్తే broad principles మీద మాట్లాడండి

Srimathi C AMMANNA RAJA — తరువాత handicapped children విషయంలో కొంత provision చూపించారు దానికి నేను చాలా సంతోషిస్తున్నాను వాళ్ళను train చేయడానికి schools ఎక్కడెక్కడ వుంటాయో అవి అన్నీ ఆలోచించి, అక్కడకు కొంతమందిని పంపి, train చేయించి పెట్టుకోవలసిన అవసరము వున్నది

తరువాత juvenile offenders విషయము వున్నది వీరు మామూలుగా offences commit చేసి యిక్కడ జైళ్లలోకి వచ్చారు వీరందరిని సరియైనపద్ధతిలో తీసుకొనిరావడములేదు ఏదో rigorous prisoners గా పెట్టి వృత్తులలో పెట్టుతున్నారు ఆవిధంగా కాకుండా వాళ్ళకు regular గా reformatory గా ముందుకు వచ్చేటట్లు moral instructions యిటువంటివి యిస్తూ వాళ్ళకు మంచి జ్ఞానము వచ్చేటట్లుగా చేయాలి వాళ్ళను మంచి పౌరులుగా తయారయ్యేటట్లు ఒక పథకమును ఏర్పాటుచేయాలి దీనివల్ల వారు reform అయ్యేటట్లు చేయాలిగాని rigorous prisioners కు యిచ్చే వృత్తులు నేర్పిస్తే ప్రయోజనములేదు

ముఖ్యంగా స్త్రీలకు, బిడ్డలకు ప్రభుత్వము ప్రత్యేకశ్రద్ధ తీసుకోవాలని కోరుతూ విరమిస్తున్నాను

Sri K SUBBA RAO — అధ్యక్షా! సంపూర్ణ స్వాతంత్ర్య సమరాంగణంలో యోధుడుగానున్న శ్రీ కళా వెంకటరావుగారు ఈ ఆంధ్ర దేశానికి ప్రప్రథమంగా సర్వతోముఖాభివృద్ధికి చేసినటువంటి పథకాన్ని నిర్మించ గలిగినందుకు నేను వారిని అభినందిస్తున్నాను వారు సభ్యులకు సమర్పించిన ఈ పత్రాన్ని చదువుతూ, చదువుతూ రాగా ఎంతచక్కగా ఈ ఆంధ్రావని సంతతిని కూడా సర్వాంగ సుందరంగా చేయడానికి ఎన్ని విధాలుగా వారు ప్రయత్నాలు (అధికారులతో సహా) చేసినారో చూస్తే చాలా సంతోషము అవుతున్నది కాని దీనిని తెలుగులో అచ్చొత్తించి సభ్యులకు ఇప్పుడు కాకపోయినా ప్రభుత్వము అంగీకరించిన తరువాత విరివిగా పంచిపెడితే ప్రజలు అత్యుత్సాహంతో ఈ పథకానికి ముందంజవేసి ప్రోత్సాహంచేసి దేశాన్ని అభివృద్ధి చేసుకునే దానికి అవకాశము కలుగుతుందని చెప్పి వారికి తెలియజేస్తున్నాను ముఖ్యముగా ఇది ఆంధ్రావనికి ప్రథమ పథకము ఈ పథకము యొక్క ఉద్దేశ్యము సర్వ జనులకు అసన, వసన, నివాససౌకర్యాలు ఏర్పాటుచేసి ప్రజల్లో నిరక్షరాస్యతను నిరుద్యోగమును నిర్మూలనచేసి, వారిని బుద్ధిమంతులుగా, బలవంతులుగా, భాగ్యవంతులుగా చేయడానికి సమకూర్చే ఇది ప్రథమ ప్రయత్నము ఇందులో మొదటి పంచవర్ష ప్రణాళిక ఆహార కొరతను తీర్చడానికి కొంత ప్రయత్నము చక్కగా జరిగినది ఆంధ్రదేశ అదృష్టమా అని అన్నమో రామచంద్రా అని అడుగవలసిన అవసరము ఇంక లేదు ప్రజలకు కావలసినటువంటి ధాన్యము పండి కావలసినటువంటి వ్యవసాయాభివృద్ధి కావడానికి అవకాశము ఉన్నది దానికి దోహదముచేసి దినదిన ప్రవర్ధమానంచేసి దానిని చక్కగా ఒక్కచో పదింతలు పండేటటువంటి అభివృద్ధికి కావలసిన పథకము ఇందులో కొంత సూచించారు అది చాలా చక్కనిది

రెండవ పథకము పరిశ్రమలను గురించి చెబుతున్నారు ఆంధ్ర దేశానికి పరిశ్రమలు ముఖ్యముగా అవసరము ఈ పరిశ్రమలు ఏవేవి ఎక్కడెక్కడ, ఏ ప్రాంతాల్లో

నిర్మించవలసిన విషయము కూడా ఇంతకుముందు చర్చించినారు కాని పరిశ్రమలకు అవసరము అయిన మూలధనము వచ్చే విషయములో మాత్రము దేశములోని ఈ శక్తి సంపన్నతలు కంటుపడినవి ఈ మూలధనము సేకరించడానికి తగిన ప్రయత్నాలు చాలా చక్కగా చేయవలసినది అని వారిని ప్రార్థిస్తున్నాను మూలధనము ఉన్నది కాని ప్రభుత్వము గారు ప్రజలలో ఒక ఉత్సాహం కల్పించి మూడు రూపాయిలకు తక్కువ లేకుండా వారికి డిబెంచరు సిస్టములో ల్యాండు మార్ట్‌గేజి బ్యాంకులు వడ్డీకి ఇచ్చేట్లు పెట్టుబడి చేసేవారికి కూడా తగిన వసతి ప్రభుత్వము కల్పిస్తే సే దానిపైన మొదటి ప్రయత్నములో కొంత కష్టము అయినా, వడ్డీ కొంచము అయినప్పటికి ప్రభుత్వానికి ఇస్తామని దాచిపెట్టిన ధనము బయటకు వచ్చి పరిశ్రమల అభివృద్ధికి ఎంతయినా సహాయము చేసే టటువంటి ప్రయత్నము జరుగుతుంది అందులో ముఖ్యంగా ఈనాడు సమాజ సమానము చేయాలనే సంకల్పం చేసుకొని సాధ్యమైనంతవరకు అన్ని పరిశ్రమలలోను నూటికి 51 కి తక్కువలేకుండా షేర్లు ప్రభుత్వమువారు కొనడానికి సంకల్పించినారు అందులో కూడా ఈ సమాన ప్రతిపత్తికి ఎక్కువగా భాగదారులు కావాలి పరిశ్రమల్లో ఉంటే లోటువల్ల ఇంతవరకు ప్రత్యేకంగా కొంతమంది పెద్దలు సూచించిన వాటిలో పనులు బాగా జరుగలేవని ముందుకు వచ్చి డబ్బు వేసే వాళ్లు చాలా భయపడ్డారు వీరందరికి ప్రోత్సాహము కల్పనచేసి ప్రభుత్వమే సాధ్యమైనంతవరకు ఈ పరిశ్రమల పరిపాలనా బాధ్యత వహించి పనిచేస్తామని హామీ ఇచ్చినట్లయితే తప్పకుండా డబ్బు వస్తుందని వారికి తెలియ జేస్తున్నాను ఇంతవరకు ఏ ప్రాంతానికి ఏ పరిశ్రమలు చేసినారో ఆ పరిశ్రమల అభివృద్ధికిగాను ఆ పరిశ్రమలను ప్రోత్సహించడానికి తగిన ప్రచారము చేయవలసిందని మరొక సలహా చేస్తున్నాను అంతకంటే ఎక్కువగా ఈ దేశములో 16 వేల గ్రామాలు ఉన్నాయి ఈ 16 వేల గ్రామాలలోను నిజముగా జపాను పద్ధతో, ఇంకే పద్ధతో అంటున్నారు కదా, జపాను రాజ్య పరిపాలన పద్ధతి ప్రకారము 16 వేల గ్రామాలను వెయ్యి భాగాలుగా చేసి ఒక్కొక్క భాగానికి ప్రభుత్వము చేయదలుచుకొన్న సర్వతో ముఖాభివృద్ధికి కావలసిన సూచనలు ఆదర్శప్రాయంగా చూపించేటటువంటి అవకాశము కలుగజేయాలి ఈదినము పల్లెపట్టులలో ప్రజలు విద్యలేక నిరక్షరాస్యులుగా ఉండి పోకిరీలుగా పోకిరీలుగా తిరుగుతుండేవారు, లెక్కలు పట్టి చూచినట్లయితే, చాలామంది కనిపిస్తారు వారినందరిని అదుపులో పెట్టడానికి ప్రభుత్వము ఇంతవరకు ఏమీ చేయలేదు వారిని మంచి మార్గములో పెట్టడానికి తగిన ప్రయత్నము చేయాలి వారికి ఇంతవరకు వున్న విద్యావిధానములో సరియైన తర్ఫీదు ఇచ్చే టటువంటి పాఠశాలలు ఎక్కడాలేవు జపాను పద్ధతి అనకొండి, లేకపోతే జనతా స్కూల్సు పద్ధతి అనకొండి ప్రజా సముదాయానికి, పల్లెపట్టుల్లో ప్రతి ఫిర్కాకును కనీసం విద్యాకేంద్రములో ఒక స్కూలు పెట్టి పోకిరీలుగా, పోకిరీలుగా తిరుగుతూండే పిల్లలనందరిని ఒకచోటచేర్చి వ్యవసాయము లోనూ, పరిశ్రమలలోనూ వాళ్ళకు ఉత్సాహము కలుగజేసేటటువంటి మార్గంలో వాళ్ళను తీసుకుపోయే టటువంటి పథకము ఇందులో ఎక్కడాలేదు వాళ్ళను చూచి వాళ్ళు అనుభ విస్తున్న కష్టాలన్ని కూడా నివారణచేయాలి చాలామంది పల్లెపట్టులలోని ప్రజలు పెద్ద పెద్ద రైతులు పిల్లలను చదువు నిమిత్తమై పట్టణాలకు పంపించెదరు ఆ పిల్లలు తండ్రులు పంపిన డబ్బును సిగరెట్లకు, సినిమాలకు ఖర్చుపెట్టుకొని పరీక్షలలో ఉత్తీర్ణులుకావటంలా

ఇండకపోతే, వారిని చూచి తల్లిదండ్రులు కంటతడి పెడుతున్నారు నేను ఒక తాలూకాలో లెక్క పెడితే 500 మంది నాల్గవఫారము, అయిదవ ఫారము ఉత్తీర్ణులు కాకుండా పోలీలుగా, పోకిరీలుగా తిరుగుతూంటేవారు ఉన్నారు వారిందరిని ఒక కేంద్రములోకి చేర్చవలసిన బాధ్యత ప్రభుత్వముపై ఎంతైనా ఉన్నది వాళ్ళది తప్పు కాదు వాళ్ళకు నేర్పిన విద్య వారికి సరియైనటువంటి పున్నత మార్గమును చూపించలేదు వాళ్ళవిద్య యావత్తూ ఉద్యోగమునకు గాను ఇంతవరకు ఉన్నది విద్యయే పరమార్థము అని చెప్పేటటువంటి విద్యకు తగిన స్థాయిఫండు ఇచ్చి పిల్లలందరిని విద్యావంతులుగా తయారు చేసినట్లయితే మీరు 5 ఏండ్ల పథకమును రెండు సంవత్సరముల కాలములో చేసేవిధముగా 2 వేల మందికి 20 వేలమంది యువకులు మీ యొక్క ప్రచారానికి తగినటువంటి వారుగా తయారయి పూరూర చక్కని పని చేసేటటువంటి ప్రయత్నాలు జరగడానికి అవకాశాలు వుంటుంది కేంద్రములలో విద్యామందిరము, విజ్ఞానమందిరము, ఆరోగ్యమందిరము అనేవి ఏర్పాటు చేయాలి ఆ విధముగా చేసినప్పుడే దేశం బాగుపడడానికి అవకాశము వున్నది ఇంకా గ్రామ ప్రజలు ఉన్నారు గ్రామ ప్రజలలో ఉత్సాహానికి లోటులేదు ఈ రాజకీయ వ్యవహారాలలో జోక్యము కలుగ జేసుకొని, పైపెచ్చు వ్యవహారము చేస్తున్నటువంటి ప్రజలలో ఈ నిరుత్సాహ శక్తి ఉన్నది కాని, పల్లెలకు పోయి ప్రజలు ఈ దేశాన్ని సర్వతోముఖాభివృద్ధికి తీసుకొని వచ్చేదానికి ప్రభుత్వము తగిన చర్య తీసుకుంటే, వారికి సహాయము కావాలంటే తప్పకుండా వస్తుందని నా అనుభవమువల్ల చెబుతున్నాను 40 గ్రామాలలో నేను అడిగితే లేదనకుండా డబ్బు ఇచ్చే ప్రజలు ఉన్నారు అంటే శ్రమదానపూర్వకంగా కొందరు ఇవ్వవచ్చును కొందరు ధన దాన పూర్వకంగా ఇవ్వ వచ్చును ఆ ప్రచారానికి తగినటువంటి పనిఇప్పుడు నేషనలు ఎక్స్టెన్షను సర్వీసుద్వారా కమ్యూనిటీ ప్రాజెక్టుద్వారా జరుగుతున్నది కాని ఇందులో అధికారులకంటే అనధికారులకు ప్రాబల్యం తక్కువగా ఉన్నది వారి బరువును అంతా అనధికారులపైనవేసి, వాళ్ళను ఒక్కొక్క ఫిర్కాకు ఈపంచవర్ష ప్రణాళిక అభ్యుదయకమిటీలుగా ఏర్పాటుచేయాలి ఏపక్షమువారు అయినా సరే దేశము నాది అని చెప్పుకునేవారు ఎందరో ప్రయత్నము చేస్తున్నారు ఏ రాజకీయపక్షానికిచెందినా సరే వారందరినీ అక్కడ చేర్చి ఈ అభ్యుదయానికి తగినటువంటి ప్రయత్నము చేసేటటువంటి ఒక స్థావరమైన, శాశ్వతమైనటు వంటి సంఘాలను నిర్మాణము చేయాలి ప్రతి ఫిర్కాకు అయినా సరే వాళ్ళు ఈ ప్రచారముచేస్తే ప్రజలనుంచి తప్పకుండా డబ్బు రావడానికి వీలుంటుంది ఇంకా దేశంలో ఖర్చుపెట్టడానికి ఎన్నో కోట్ల రూపాయలు కావలసివున్నది ఢిల్లీ ప్రభుత్వము వారు ఈ పథకాన్ని సంపూర్ణంగా అంగీకరించే ప్రయత్నము యావత్తూ ఈ పథకము వేసినటువంటి మంత్రిగారు చేస్తారని నేను వారిని ప్రార్థిస్తున్నాను కావలసిన డబ్బు తప్పకుండా వస్తుంది కాని డబ్బు ఎక్కడనుంచివస్తుంది అని చెప్పేటటువంటి శాసనసభ్యులు యావన్మంది పన్నులు వేయకూడదు అంటారు పన్నులు వేయకుండా డబ్బు వచ్చేది ఎట్లా ? పరోక్షపు పన్నులు వేస్తే వేయండి అంటున్నారు ప్రత్యక్షమో పరోక్షమో మనకు కావలసింది డబ్బు ఏ విధముగా డబ్బు రావడానికి అవకాశము ఉంటుందో చూచి అవిధంగా చేయవలసి యుంటుంది. దేశంలో డబ్బు ఉన్నది

ఉన్నచోట తీసుకోండి బీదల దగ్గర తీసుకోమని చెప్పడములేదు భాగ్యవంతుల దగ్గర తగినటువంటి ప్రయత్నము చేయాలి విద్యావిషయములో తగిన మార్పు చేసి, వినయముతో కూడిన విద్య, వివేకంతో కూడిన విజ్ఞానము దేశంలో ఎంతవరకు కావాలో అంతవరకు ప్రభుత్వమువారు చేస్తే ఇది స్వాతంత్ర్య సమరాంగంలో ఒక భాగమైనటువంటి ఒక [illegible]రము అవుతుంది ఏ దినము అయితే దేశాన్ని దరిదాస్యమునుంచి తప్పించి దుఃఖమును, దాస్యమునుంచి దారిద్ర్యాన్ని నివారముచేసి, దుఃఖమును లేకుండా సుఖసౌభాగ్యాలతో దేశము సరియైన విజ్ఞానములో పెట్టడానికి కాంగ్రెసు ఆ దినము నిర్ణయము చేసుకున్నది దాస్యమును నిర్మూలించినంత మాత్రాన దారిద్ర్యము పోలేదు ఆ దారిద్ర్యాన్ని నివారణకు చేసినటువంటి పథకము ఇది ఆ పథకము సర్వప్రజల్లో చక్కగా ప్రచారము చేసేందుకు ప్రచార సౌకర్యాలు ఏర్పాటుచేసి సర్వప్రజలకు తగినటువంటి వసతులు కలుగజేసి అందరిని భాగదారులుగా చేసుకోవలసిఉంది శ్రీమతి అమ్మన్నరాజాగారు చెప్పినట్లు ఈ దేశంలో నూటికి 52 మంది అనుభవముగల స్త్రీలు ఉన్నారు మీరు ఎంతోమంది పురుషులు బహుపరాక్రములు విక్రమార్కులు అని చెప్పినా, మీరు దేశాన్ని ఎంతో ముందుకు తీసుకుపోగలము అని చెప్పినప్పటికిని స్త్రీలు ప్రతి ఇంట, ప్రతి ఊర అడ్డు పడుతూందేవారు వున్నంతవరకుకూడా ఏ పురుషుడైనా కూడా ముందంజ వేసి పనిచేయడానికి వీలుకాదు

ఈ ప్రాంతములో రెండు సోషలు వెల్ఫేరు సెంటరులు వున్నాయి ఇద్దరు ఆడపిల్లలు చక్కని వయసులో వున్నటువంటివారు ఆ ప్రాంతములోకివచ్చి చక్కగా పని చేస్తుంటే వూరిలో అందరి స్త్రీలకు వుత్సాహము కలిగింది కనుక ఈ సోషలు వెల్ఫేరు సెంటర్లలో కావలసినంతమంది స్త్రీలకు శిక్షణ చేయవలసిన అవసరమున్నది దానికి ప్రయత్నముచేస్తే స్త్రీలు ప్రచారముచేయవలసి వస్తుంది మొన్ననే బెంగుళూరులో మైసూరు ప్రభుత్వమువారు ఒక ప్రచారము చేశారు స్త్రీలనుంచి స్మాల్ సేవింగ్సు వసూలు చేయవలసిందని ఆడవారందరిని కలసి ఒక ప్రయత్నముచేస్తే స్త్రీలు ప్రతి ఇంటికిపోయి మూడు దినములలో 6 లక్షల రూపాయిలు వసూలు చేసినారు అల్లాగే ఇక్కడ కూడా ఈ స్మాల్ సేవింగ్సు అనేటటువంటిదానికి తగుమైనటువంటి ప్రయత్నము చేసి ఇంటింట, వూరూర, పల్లెపట్టులలోనే కాకుండా, పెద్దపెద్ద పట్టణములలో స్త్రీల దగ్గర దాచిపెట్టినటువంటి ధనాన్నికూడా దేశంలో ఈ వ్యవహారానికి తీసుకొనివచ్చే దానికి తగినటువంటి ప్రయత్నముచేయాలి ఆ ప్రయత్నము చేసినప్పుడు దేశం సర్వతోముఖాభివృద్ధిచెంది! సర్వకళలతో, సర్వాంగసుందరంగా కీ॥ వెంకట్రావుగారి కోలములోనే దేశం వర్ధిల్లుతుందని చెప్పి నేను ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను

Sri P SATYANARAYANA —అధ్యక్షా! ఈ ద్వితీయపంచవర్షప్రణాళికలో ప్రభుత్వసెక్టరు అనుపేరుతో 3500/- కోట్లు అందుకు ప్రత్యేకించి ఇనుము, ఉక్కు మొదలైన heavy industries లో పెట్టుటకు ఉంచామని శ్రీ వెంకట్రావుగారు చెప్పారు ఈ విషయములోనే భారతదేశము మొత్తముమీద ధనికవర్గమువారు తమ చేతులలో ఉన్న దినపత్రికలద్వారా రెండవ పంచవర్షప్రణాళికలోని ఈ భాగమును చాలా ఘాటుగ ఎదుర్కొంటున్నారు కేంద్రప్రభుత్వములోకూడా agentsగా ఉండి ఘటుగా పనిచేసేవాళ్ళు ఉన్నారు మొత్తముమీద దీనిని మనమంతా కలసి ఘాటుగా ఎదుర్కొని ముందుకుపోగలమని నమ్మకముగా అమలుజరుపుతామని అనుకోవడ

ము కనుక వల్ల కాదు మొత్తము plan లో 7 వేలకోట్ల రూపాయలు మించిన ఈ plan లో 3400/- కోట్లకు సంబంధించిన ఈ భాగమునకు మణిపూస అని చెప్పవచ్చు అయితే ఇలాంటి heavy industry లో ఒక పనివానికి పని కల్పించాలంటే 11 వేల రూపాయలవరకు కావాలని నిరూపించారు ఈ పద్ధతిలో చూస్తే ఉద్యోగము లను అభివృద్ధిచేయడానికి ఎంతమాత్రము ఉపయోగపడదు కేవలము జాతీయ ఆర్థిక విధానము యితరదేశములమీద ఆధారపడకుండా ఒకరకమైన పూర్ణస్వాతంత్ర్యమును సంపాదించుకొన్నటువంటి ఒక మహోద్దేశము నెరవేరుతుంది దానికి సందేహము లేదు అయితే ఈ నిరుద్యోగము అనేది చాలా పెద్దసమస్య ఎలాంటిసమస్య అంటే 1939 నుండి 45 వరకు యుద్ధము ఒకసమస్యఅయితే 1950 నుంచి 55 వరకు నిరుద్యోగము అంత పెద్దసమస్య అనే ధోరణిలో కేంద్రమంత్రులుకూడా రేడియో talks దగ్గరనుంచి గట్టిగా చెప్పారని ఒప్పుకొంటున్నారు ఏదైనా ఒక పెద్దసమస్యను మనము పరిష్కరించ డానికి పూనుకొనవలసివుంటే ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఇది కూడా ఒక పెద్ద సమస్య దానిని పరిష్కరించడానికి సాధారణముగా రెండుమార్గములున్నవి Factories అభివృద్ధిచేయుట, చేతివృత్తులను అభివృద్ధిచేయుట, factories కు పెట్టుబడి చాలదని నిరుద్యోగసమస్య తీర్చలేమని అందువల్ల చేతిపరిశ్రమలకు ఇమ్మన్నారు ఇప్పుడు ఉన్నటు వంటి factories విషయములో వాటిని full capacity కి work చేయించే పథకములను తప్పకుండా మనము వేసుకొనవలసియున్నది నిన్న మన చేతిలో పెట్టిన ఆ చిన్న కరపత్రంలోమాత్రము ఎంతచదివినా నాకు పూర్తిగా ఆ విషయములో సందేహాలు తీరలేదు ఉదాహరణకు మన ఆంధ్రరాష్ట్రములో 7 spinning మిల్లులలో 25 వేల కదురులు లేకపోతే economic unit కాదు అని experts నిర్ణయించారు ఆరకంగా upgrade చేయడానికి ఏదైనా plan ఇందులో ఏమైన ఉన్నదా అని చూస్తే అటు వంటిది ఏమీ కనిపించలేదు ఒకటి private sector అన్నప్పటికి మన బాధ్యత తీరిపోదు అందుచేత మొత్తముమీద factory system ను విస్తృతము చేసేటటువంటి సూచన ఏమీ ద్వితీయపంచవర్షప్రణాళికలో మన factories full capacity గా work చేసే పథకము తప్పకుండా ఉండాలని, నిజముగా నిరుద్యోగసమస్యను పరిష్క రించాలంటే ఈ దశలో చేతివృత్తులు తప్ప మరొక శరణ్యములేదు అనేది అందరూ అంగీకరించిన ఆ కారణం చేతివృత్తులవిషయములో చేనేతపరిశ్రమకు ఒక విశిష్టమైనస్థానము ఉన్నది కేవలం వ్యవసాయముతరువాత అత్యధికముగా ఉపాధికల్పించిన వృత్తి చేనేతతప్ప మరొకటి లేదు ఆంధ్రరాష్ట్రమునకు ఇంకా విశిష్టత ఉన్నది 26 రాష్ట్రముల భారత దేశములో దక్షిణభారతములో ఆంధ్రరాష్ట్రములాంటి కొన్ని రాష్ట్రములలోమాత్రమే కేంద్రీకరింపబడి ఉన్నది మన రాష్ట్రములో మూడులక్షల మగ్గములున్నవి ఎందుచేతనో 6 లక్షలమందే జీవిస్తున్నారు అంటున్నారు కాని 15 లక్షలమంది ఉంటారు మూడులక్షల మగ్గములుఅయినా ఎంతవరకు వాటిని full capacity కి work చేస్తున్నారో తెలియదు అసలు work చేయుటంలేదని ఈవాళ రెండోజులనుంచి ప్రశ్నలకు సమాధానం చెప్పినమంత్రి గారే అంగీకరించారు దానికి ఉన్నటువంటి capacity కి work చేస్తే రోజుకు 7 గజాల చొప్పున సంవత్సరమునకు 61 రోజులు తీసివేసి 300 రోజులే పనిచేస్తారు అనుకుంటే, 60 కోట్లగజాలబట్ట మన రాష్ట్రములో ఉత్పత్తిచేసే సావకాశము ఉన్నది ఈ 60 కోట్ల

గజాలబట్టకు కావలసిన నూలు లెక్క వేసి నట్లయితే, ఒకపౌను నూలుకు 7 గజాల బట్ట దామాషా ప్రకారం కనుక 9 కోట్ల పౌనుల నూలు కావాలి ఇంతవరకు Hand-book of Andhra statistics అనేదానిలో గాని, మంత్రిగారు యిచ్చిన కర పత్రములోగాని ఎంత ఉత్పత్తి ఈ పరిశ్రమలలో జరుగుచున్నది కన్పించలేదు కాని నాకు తెలిసినంతవరకు ఇక్కడ 56 వేల కదుళ్ళుమాత్రమే ఉన్నవి 7 మిల్లులలోను కలసి మొత్తనే 65 వేల కదుళ్ళు ఉన్నవి అయితే ఒక్కొక్క కదురు 8 గంటలకు ఒక్కొక్క shift చొప్పున, shift కు 4 కౌన్సు నూలు చొప్పున పనిచేస్తే రోజుకు 12 పౌనుల చొప్పున అవుతుంది 300 రోజులు పనిచేస్తారని అనుకొంటే ఇంకా 3 లక్షల 5 వేల వరకుకూడా మనకు కావలసి ఉంటవి

ఆంధ్ర దేశంలో వున్నటువంటి మగ్గాలకు చాలినంత నూలు, యిక్కడ దూది ఎలాగూ వున్నది కనుక, యిక్కడే తయారు చేయించుకొందామని అనుకుంటే యింకా 8 లక్షల పైన కదుళ్ళు పెట్టేటటువంటి నూలు మిలుల పరిశ్రమ యిక్కడ పెట్టడానికి సావకాశం వున్నది దీనిని గురించి ప్రభుత్వం గట్టిగా ఆలోచించ వలెనని నేను కోరుతున్నాను ఇప్పుడు ఆంధ్ర దేశానికి కావలసినటువంటి నూలుకు ఖాదీ బోర్డుకి అనేక economic units కి 8 మిల్లులకు సరిపడే దూది ఆంధ్ర దేశములోవున్నది, ఇది దక్షిణాదికి, అహమ్మదాబాదుకి, విదేశాలకు పోతుందని సంస్థల్లనుంచి వచ్చి నటువంటి రిపోర్టును బట్టి తెలుస్తున్నది అందుచేత full employment అనేటటువంటి ఒక target మనం పెట్టుకున్నట్లయితే కనీసం యీ రంగములో నైనా మనం ప్రత్యేకంగా కృషి చేసినట్లయితే వచ్చినటువంటి యీ పెట్టుబడి ప్రభుత్వం యిస్తుంది, లేక ప్రజలు తెస్తారు, లేక యితర రాష్ట్రాలనుంచి వస్తుంది వివరాలు తరువాత work out చేసుకోవచ్చు మొత్తంమీద అట్లాఅయితే అదనంగా 8 లక్షల కదుళ్ళకు కొత్తగా ఆంధ్ర రాష్ట్రంలో సావకాశం వున్నది అనేటటువంటి విషయం మనం గమనించి ఆ విధంగా పనిచేయవలె రాను రాను agricultural diversification schemes ప్రకారం ఈ దూది ఉత్పత్తి ఇంకా పెరుగుతుంది ఇప్పుడున్నటువంటి దూది 8 వంతులలో ఒక వంతు మాత్రమే ఉపయోగించి మిగతాది పైచోట్లకు పంపిస్తున్నాము ఇంకా ఉత్పత్తి పెరుగుతుంది అందుచేత మనం ప్రత్యేకంగా నూలు మిల్లులను నిర్మించే ధోరణిలో కృషిచేయవలసినదిగా కోరుతున్నాను ఇంక ఈ రెండో పంచవర్ష ప్రణాళికలో కుటీర పరిశ్రమల విషయంలో పెద్దది చేనేత పరిశ్రమ అనుకుంటున్నాం చేనేతవారికి యిది ఏమి యిస్తున్నది? ఇంకా 5 ఏండ్లుపోయిన తరువాత ఈ ప్రశ్న వేసికొని మొత్తం అంతా తిరగవేసిచూచి నప్పటికీ కూడా basic aid యేమీ యిందులో కనిపించడంలేదు ఇప్పుడు ఒక నెలలో పని వుంటే మరొక నెలలో పని వుండడం లేదు పండుగలుంటే కాస్తపని వుంటుంది మందం వస్తే పని వుండదు నూలుధర చూస్తే విపరీతముగా పెరిగి వున్నది పుట్టి (14 మణుగుల పుట్టి) 1954 వ సంవత్సరములో గుంటకల్లులో 500 రూపాయలున్నది ఇవేళ గుంటకల్లులో 200 రూపాయలు దూది రేటుంటే యివ్వేళ కూడా అంతే రేటున్నది ఇంచుమించు 10 pound ల నూలు కట్టకి మహాతగ్గితే 1-0-0, 1 8-0 లోపున తగ్గిందేకాని అంతకన్నా ఎక్కువ తగ్గలేదు

అయినటువంటి కలిసినటువంటి కుటుంబములో పిల్లవాళ్ళు, పెద్దవాళ్ళు ఖచ్చితంగా కష్టపడి రోజుకు 12 గంటలు పనిచేస్తే నెల ఒక్కింటికి 25 రూపాయలు గిడుతుంది అనీ చేనేత పారిశ్రామికుడు 5 సంవత్సరాల ప్రథమ పంచవర్ష ప్రణాళిక వచ్చిన తరువాత యీ ఒడ్డుకు చేరుకున్నారు 10 సంవత్సరములైన తరువాత రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తయిన తరువాత ఏ ఒడ్డుకు చేరుతాడో చూదామంటే ఇంకా గో, ఆదేమీ కనిపించడంలేదు స్పష్టంగా దీనిగురించి మనం ఆలోచించి నప్పుడు Market సంగతి విచారించకుండా వుండలేము బట్టనరు నూలుధర యీ సమస్య విచారించకుండా వుండలేము మంజూరీ అనేసమస్య విచారించకుండా వుండలేము సాధారణంగా పెట్టుబడిలేక కృశించి విదేశపోటీకిగురై బాధ పడేటటువంటి చిన్నపరిశ్రమల విషయంలో సోషలిస్టు ప్లానింగు కలిగివుంటున్నప్పుడు దీనిని ముఖ్యంగా గమనించవలసి యుంటుంది ప్రపంచంలో సోషలిస్టు ప్లానింగుకల దేశాలు చాలా వున్నాయి కదా! ఇప్పుడు ప్రపంచంలో సగం దేశాలలో సోషలిస్టు ప్లానింగు వున్నది ఆ దేశములో వాళ్ళు అనుసరించే మార్గము యేమిటంటే ప్రభుత్వము యిచ్చే టటువంటి కూలిగాని, factory లో యిచ్చేటటువంటి కూలిగాని, ఉద్యోగులకు యిచ్చేటటువంటి జీతముగాని కొంత భాగము వస్తు రూపంగా యిస్తుంది. అది ఒక policy ఆ వస్తు రూపకంగా యివ్వడంలో అనేక లక్షలకు మనకు కావలసి నటువంటి వస్తువులను కొనడానికి ఒక customer గా market లో ప్రవేశిస్తుంది ఒక buyer గా మార్కెట్టులో ప్రవేశిస్తుంది అందుచేత యిలాంటి పరిశ్రమలలో biggest customer ఎవరూ అంటే Government ఇది ధరలలో fluctuations రాకుండా ఎగుడుదిగుడులు రాకుండా కాపాడ్డానికి పనికవస్తుంది తరువాత continuity of work పనివాళ్ళకు యివ్వడానికి పనికివస్తుంది ఈ system ను అర్ధ ప్రపంచం అనుసరిస్తున్నది పైన ఏధరకు పరిశ్రమను కొనాలి అన్నప్పుడు ఏ ధర యిస్తే పనివాళ్ళకు living wage వస్తుందో అంటే వాళ్ళు motor car లలో తిరుగవలెనని కాని లేక ఒక పూట తిని రెండోపూట లేకుండా వుండవలెనని గాని ఈ రెండూ extremes విడిచిపెట్టి, మధ్యేమార్గంలో ఒక living wage నిర్ణయించి, ఎవరూ కొనలేనంత ధరకు ప్రభుత్వం కొంటుంది ఒక biggest customer గా market లో ప్రవేశించి కొంటుంది ఆదే అక్కడున్న practice దీని ననుసరించి నట్లయితే కనీసం phased programme, stages ప్రకారమయినా అనుసరించే ట్లయితే మంచిరోజులు రాబోతున్నాయి అనే ఆశ అయినా కొద్దిగా వుండును. చేనేత పారిశ్రామికులకు అది కూడా యేమీ కన్పించడంలేదు ఇంకొకటి, మీ చేతులలో co operative societies వున్నాయి. అవి యించుమించుగా semi governmental institutions, ఇప్పుడు నేను చెప్పినటువంటి 25 రూపాయల మజూరీ co operative societies నేయికుంటే 10 రూపాయలు కిడుతుంది. సొసయిటీలకు మొత్తం వచ్చిన wage bill ను working looms చేత భాగిస్తే నెల ఒక్కింటికి 10 రూపాయలు కంటె ఎక్కువ రాదు Co operative Society ఆసరాన్ని నమ్ముకుని ప్రవేశించిన తరువాత భ్రమలు తొలగిపోయి ఎయటకు పోతున్నారు కాని యిప్పుడు—

The Hon Sri K VENKATA RAO – అక్కడ అప్పు తీర్చకుండా పోతున్నారు

4th August 1955]

Sri P SATYANARAYANA — కరువురోజులలో అప్పు వస్తే ఏమి చేస్తారు? అప్పటినుంచి కరువు అలానే వుండిపోయింది Co operative societies విషయంలో కనీసం మీరు ఒక పని చేయవచ్చు సాలు పొడుగునా 360 రోజులు పని చెప్పగలమని ఖచ్చితంగా ఒక living wage— యింతకు మించి యివ్వలేము, యీ మాత్రం తప్పకుండా యిస్తాం అని— ఒక రకమైన assurance యిచ్చి కనీసం యివ్వగున్న, చేనేత జనాభాలో 3 వ వంతు మాత్రమే society లలో organize అయివున్నది, వాళ్ళకు మాత్రమే పని చెబితే చాలు మిగిలిన రెండవంతులకు పని చెప్పనక్కరలేదు వారికైనా ఒక గ్యారంటీ వున్నప్పటికీ కూడా కొంతవరకు మేలే అనిపించుకుంటుంది కనీసం ఈ 1/3 వంతు వారికైనా యీపంచవర్ష ప్రణాళికలో లాభం కలిగిస్తే ధైర్యంతోటి గాళ్ళు వుండడానికి వీలవుతుంది అందుచేత కుటీర పరిశ్రమలని గట్టిగా బల్లగుద్ది చెబుతున్నారు అసలు వాస్తవంగా జరగవలసి నటువంటి రంగములో ఏమీ జరగలేదు ఎంతమాత్రమూ జరగడంలేదు చీరలు, ధోవతులు కేటాయించాలనేది ఒక అరణ్యరోదనంగా 30 ఏళ్ళనుంచి జరుగుతూవున్నది నేటికీ దానికి దిక్కులేదు నూలు మిల్లులకైనా యివ్వమని 30 ఏళ్ళనుంచి, అరణ్యరోదన జరుగుచున్నది కాని దానికి కూడా దిక్కులేదు మేము రోజుకి 15 గంటలు పనిచేస్తాం, 50 రూపాయలైనా ఆదాయం వచ్చేటట్లు చూడండి అంటే దానికి సంబంధించిన assurance లేదు

సంవత్సరములో మూడు వందలు రోజులు మాకు పని చూపండి దేశములో అందరికీ కాదు, కనీసము మూడవవంతు మందికో లేక సగముమందికో మీరు పనిచూపండి అంటే ఈవిషయములో ఎక్కడా assurance లేదు ఇందులో వ్రాసిన విషయాలన్ని కూడా యీారకముగా వున్నది. మా ఆశయమని చెప్పడమే కాని దానికి తగినటువంటి బందోబస్తులో పెట్టుకొన్నటువంటి plan అందులో ముఖ్యముగా కుటీరపరిశ్రమలు చిన్నవారికి సంబంధించి నటువంటి plan కట్టు దిట్టముగా ఏమీలేదని చెప్పే నా అభిప్రాయము

Sri AYYAPA REDDI — అధ్యక్ష మహాశయా, యీ ద్వితీయ పంచ వర్ష ప్రణాళికను మంత్రివారు యీ సభకు సమర్పించే ముందే ఆంధ్రదేశములోని సిరి సంపదలను గురించి ఖనిజ సంపదలను గురించి జంతుజల సంపదలను గురించి జనసంపదను గురించి ఏదైన ఒక నివేదిక సమీక్షచేసి సభ్యులకు అందజేసి వుంటే యీ ప్రణాళికను అర్థము చేసుకొనే దానికి విమర్శ చేసేదానికి అవకాశముండేది జన సంపద, జల సంపద, వస్తు సంపదను గురించి ఏమాత్రము ఆ Hand Book of Statistics లో లేదు ఈ ప్రణాళికను రెండు విధాలుగా భావించవచ్చును ఒకటి వ్యవసాయిక రంగములో రావలసిన అభివృద్ధి రెండవది పారిశ్రామిక రంగములో రావలసినటువంటి అభివృద్ధి ఇది ఆంధ్ర రాష్ట్రము యొక్క మొదటి ప్రణాళికగా మంత్రిగారు సెలవిచ్చినట్లు వ్యవసాయిక రంగానికి ఎక్కువ ప్రాముఖ్యత యిచ్చినారు వ్యవసాయిక రంగములో దానికి అనుబంధమైనటువంటి పశు సంపద అభివృద్ధికి దానికి అనుగుణ్యమైన పరిశ్రమల అభివృద్ధికి దోహదము, తగినంత ప్రత్యేకత యివ్వలేదని నా అభిప్రాయము వాస్తవానికి ఆంధ్రదేశములో ముఖ్యంగా యీ Animal Husbandry పశు సంపదను గురించి, పశు సంపదవల్ల ఉత్పత్తి అయ్యే వస్తువులను

గురించి, ఎగుమతి దిగుమతుల విషయములో కాని, ఆహార విషయములో కాని జరుగవలసిన ఉత్పత్తి చేసినయెడల ఈ దేశానికి, ఈ ఆంధ్రరాష్ట్రానికి ఎంతైనా వీలువుంది Diary Farming, Cattle Farming వీటిపైనే 100 కి 30 వంతులు Denmark, Belgium దేశాలు వారియొక్క ఆర్థికవ్యవస్థ ఆధారపడివున్న విషయాన్ని మనము ఆలోచనచేసి ఆ విధంగా చేసినట్లయితే ఆంధ్రదేశాన్నికూడా అదేవిధంగా పురోభివృద్ధికి తీసుకొనిపోవడానికి అవకాశముంటుందని నా అభిప్రాయము ఇప్పుడు సమర్పించిన నివేదికలో Animal Husbandry ని గురించి, "It is proposed to distribute 2300 breading bulls 6,000 cows 9 000 murray she buffaloes, 1 500 male goats, 9000 female goats, 3600 ramus, 32000 cocks 32 000 hens and two lakhs of eggs" అని ఉన్నది కాని వాస్తవానికి దానివలన జరుగబోయే ఫలితాలను గురించి మాత్రము అర్థము కాకుండా వుంది మంత్రిగారు యీ ప్రణాళిక పూర్తి అయ్యేలోగానే యీ నాడు ప్రతి ఒక్కరికి పావలాకు కనీసము ఒక శేరు మంచి నెయ్యి, పావలాకు పడి మంచిపాలు, పావలాకు మంచిరకపు బియ్యము ఒకపడి, బొట్టకు ఒక కోడిగ్రుడ్డను తయారుచేసి యివ్వాలను అని ప్రతి వ్యక్తికి సగటున 75 రూపాయలు కనీస ఆదాయము వస్తుందని ప్రణాళికయొక్క స్వరూపాన్ని ఫలితాన్ని చెప్పివుంటే ప్రజలు ఎంతో ఉత్సాహ పడేదానికి అవకాశ ముండేది ముఖ్యంగా నేను సూచించిన విధముగా యీ పావలాకు చిక్కునటువంటి పాలు, నెయ్యి బియ్యము కోడిగ్రుడ్లు యీ పద్ధతిలో ఆహార ధాన్యాన్ని ఉత్పత్తి చేయగలిగితే Hospitals కు డాక్టర్లకు అంతగా వ్యయము చేసుకోవలసినటువంటి పరిస్థితి ఏర్పడదు కాని యీ నివేదికలో 70 వ పేజీలో Diary Farm Technicians 54 మంది చాలనిమాత్రము వుంది నాయొక్క అభిప్రాయము వాస్తవానికి ఆంధ్రదేశములో ఇప్పుడువున్న పశుసంపదనుగూర్చి 54 ప్రక్కన ఇంకా రెండుసున్నలు పెట్టినా మన కొరత తీరదని నేను అనుకుంటాను 54 ప్రక్కన రెండుసున్నలు పెట్టి నేను చెప్పిన ఫలితాన్ని గనుక సాధించినట్లయితే యీపైన 70 వ పేజీలో చెప్పిన Medical and Public Health క్రింద కావలసినటువంటి నంబరును తగ్గించుకునేదానికి చాల అవకాశముంటుంది ఇక పారిశ్రామికీకరణాన్ని గురించి చెప్పవలసివస్తే ద్వితీయ పంచవర్షప్రణాళిక ముఖ్యంగా పారిశ్రామికముగ దేశాన్ని స్వాతంత్ర్యాన్ని సాధించడానికిమాత్రమే ప్రయత్నము చేస్తుంది Planning Commission కు కూడా పారిశ్రామికరణానికి అత్యధిక ప్రాధాన్యత యివ్వవలసివున్నదనే దానిని మనము గుర్తించవలసివుంటుంది అదేవిధంగా యీ planningయొక్క ఆశయాన్ని మొదటి పేజీలోనే rapid industrialisation with the particular emphasis on the development of basic industries అనేది ఒక ఆశయమని అందులో వ్రాసియున్నారు వాస్తవానికి ఆంధ్రదేశముయొక్క ప్రణాళిక పారిశ్రామిక అభివృద్ధికి ఎంతమాత్రము దోహదము యివ్వలేదని నేను చెప్పదలచినప్పుడు ఇప్పుడు పారిశ్రామిక అభివృద్ధికి మనకు 11 కోట్ల రూపాయలుమాత్రము ఖర్చుపెడుతున్నాము మనము ఖర్చుపెట్టబోయే పూర్తిమొత్తములో ఇది 4 91 శతాంశముక్రింద మాత్రమే వస్తుందని దానిలో నిర్ణయించివున్నారు పారిశ్రామికఅభివృద్ధికి ఆంధ్రదేశము అనుకూలముగా లేదని యీ plan తయారుచేసినటువంటివారియొక్క అభిప్రాయమూ, లేక పారిశ్రామిక అభివృద్ధికి ఇప్పుడు తగిన వసతిలేదని లేక ఆర్థికస్తోమతు లేదనియూ వారి అభిప్రాయము పారిశ్రామికఅభివృద్ధిలేనిదే ఏదేశమైనాకూడా ఎంత వ్యవసాయదేశము

ఏనప్పటికీకూడా ఇతరదేశాలపైన ఆధారపడవలసివుంటుంది ఇతరరాష్ట్రాలపైన ఆధారపడవలసివుంటుందనే విషయాన్ని మనము గుర్తించవలసి వుంటుంది ఉదాహరణకు 40 కోట్ల రూపాయలు వెచ్చించే Electricity తీసుకొచ్చేదానికి ప్రయత్నము చేస్తున్నారు Electricity కి కావలసినటువంటి చిన్నచిన్న వస్తువులు transformers, wires మున్నగునవి తయారుచేసేదానికి ఏమాత్రము ప్రయత్నము చేసినట్లులేదు ఆ electrical goods అంతాకూడా కేంద్రప్రభుత్వము సప్లై చేసేదానికి పూనుకుంటుందని ఒక విధంగా సూచించారు కాని ఆంధ్రదేశాన్ని ఆంధ్రదేశములోవున్న resources ను గురించి Dr C మహాదేవన్‌గారు వ్రాస్తూ నెల్లూరు జిల్లాలో వున్నటువంటి వస్తుసామగ్రిని సరిగా పరిశీలిస్తే కావలసినటువంటి electrical goodsను తయారు చేసుకోనేదానికి ఎంతైనా అవకాశముందని వారు చెప్పారు ఇది ఈ ప్రణాళిక తయారుచేసేవారియొక్క గుర్తుకు రాలేదేమో అనుకుంటాను అదేవిధముగా రాయలసీమలోవుండే వెనుకబడినటువంటి ప్రాంతాలలోకూడా కావలసినటువంటి పరిశ్రమలు స్థాపించుకోనేదానికి వీలువుంది రాయలసీమలో ముఖ్యంగా Paints Industry Asbestos Industry తయారు చేసుకోనేదానికి చాల అవకాశాలున్నాయని యింతకు పూర్వము నిపుణులు వారియొక్క reports లో వ్రాసియున్నారు కాని Industry ని start చేసేదానికి ఏమాత్రము ప్రయత్నము యింతవరకూ రాష్ట్రప్రభుత్వము తలపెట్టలేదంటే ఆశ్చర్యకరము గావుంది దానికి తగినటువంటి పెట్టుబడి ఎక్కడనుంచి వస్తుందని మంత్రిగారు సెలవిస్తేవచ్చును అసలు ద్వితీయ పంచవర్ష ప్రణాళికను తయారు చేసుకోనేదానికి ముందు Experts Committee వ్రాసినటువంటి Report లోనే ఈ విధంగా చెప్పారు "In formulating the Second Five Year Plan emphasis must be placed on the extension of public ownership or control over the strategic means of production a greater equality of opportunities and bringing down the gap between the haves and have nots and the protection and enhancement of the well being of the weak"

అని ఈ విధంగా socialistic pattern of society మన ఆశయమని చెప్పితే public ownershipకు అవకాశంకూడా ఉంది ఇతరత్రా పెట్టుబడికావాలని మన కోరడం సమంజసంగా ఉండదు అంతేకాకుండా రాయలసీమలోనైతేనేమి, వెనుకబడి ప్రాంతాలలోనైతేనేమి, పెట్టుబడిదార్లు ఎవరూ లేరనేవిషయం అమాత్యులకు తెలియని విషయం కాదు ఈ పెట్టుబడిక్రింద ఆరువేల మూడునూర్లకోట్ల రూపాయలు కేంద్రప్రభుత్వం ఈ ద్వితీయ పంచవర్షప్రణాళికలో వెచ్చించేదానికి పూనుకుని ఉంది 6 వేల 8 నూర్లకోట్ల రూపాయలు కేంద్రప్రభుత్వము స్వంతంగానూ, రెండువేలకోట్లరూపాయలు ఇతరత్రానూ వినియోగపరుస్తూయున్నారు ఆ ఎనిమిదివేల మూడునూర్లకోట్ల రూపాయలలో మనం వెచ్చించబోయే రెండువేల నాలుగునూర్లకోట్ల రూపాయలు నాలుగింట భాగం మాత్రమే అవుతుంది కాని అంతకుమించి ఏమాత్రమూ కాదు కనుక కేంద్రప్రభుత్వంనుంచి మనం కనీసం ఒక 20, 30 కోట్ల రూపాయలైనా తీసుకు రావలసియుంటుంది దానికి అమాత్యులు ఎంతైనా ప్రయత్నం చేయవలసియుంటుంది ఇంతకుముందూ, నిన్నా మొన్నా మాట్లాడిన సభ్యులుకూడా ప్లానింగు మంత్రిగారిని అభినందిస్తూ చెప్పారు నేనుకూడా అదేవిధంగా వారిని అభినందిస్తున్నాను ఏమంటే వారు ప్రతిభాధురంధరులు, ఇప్పుడు రాజకీయ వ్యవహారాలలో

యుగంధరులు ఢిల్లీకిపోతే, ఢిల్లీపు గ్రాంట్ను పట్టుకురాకపోయినా అక్కడఉండే భుజా బలాలో కొంతభాగమైనా ఆంధ్రదేశానికి పట్టుకురావాలని ఆంధ్రదేశం నిరీక్షిస్తోంది దానికి వారికి తగిన అవకాశం దోహదంకూడా లభిస్తుందని ఆశిస్తున్నాను

Mr DEPUTY SPEAKER —సభ తిరిగి 2 30 కి సమావేశం అవుతుంది

(After Lunch 2-30 P M )

Mr SPEAKER — There are still many hon Members desiring to take part in the debate To give opportunity to all, I fix the time limit of five minutes for each member

Sri N C SESHADRI — అధ్యక్షా ! Planning మంత్రిగారు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక draft ను మనకు అందజేశారు దీనికి ముందేమో 230 కోట్ల రూపాయలు కేటాయించబడిందని, ఆ తరువాత 241 కోట్లు అని అన్నారు తరువాత నిన్న రాత్రి special communication ఏదో వచ్చింది అందులో ఈ Plan కు కేటాయించిన డబ్బు తగ్గడానికి అవకాశాలున్నాయని కూడ చెప్పారు మన అవసరాలేమో జాస్తి ఉన్నాయి, కాని, ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు కేటాయించిన డబ్బేమో రోజుకు రోజుకు తగ్గిపోతున్నది ప్రథమ పంచవర్ష ప్రణాళికను ప్రారంభించిన సమయంలో మనం మద్రాసురాష్ట్రంలో ఉండినందున దానివలన మన ఆంధ్రప్రాంతము యొక్క అవసరాలు సరిగా కొనసాగలేదని, అందుచేత నిజానికిమాస్తే ఇదే మన ప్రథమ పంచవర్ష ప్రణాళికగా పరిగణించవలసిందని మంత్రిగారు సెలవిచ్చారు ఈ జాతీయ ప్రణాళికయొక్క ముఖ్యోద్దేశములు పేర్కొంటూ నాలుగు సూత్రాలను మనకు తెలియజేశారు దేశములో జీవన ప్రమాణాన్ని హెచ్చించుట, వృత్తి పరిశ్రమలకు ప్రాధాన్యమిస్తూ దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధిచేయుట, నిరుద్యోగ సమస్యను నివారించుట, సాంఘిక న్యాయాన్ని చేకూర్చుట, ఈ నాలుగింటికి ప్రాధాన్యత ఇచ్చారు అందులో ముఖ్యంగా భారీ పరిశ్రమలకు, వ్యవసాయానికి ఎక్కువగా డబ్బు కేటాయించారు వ్యవసాయానికి 18 కోట్లు చిల్లర రూపాయలు ఈ అయిదేళ్ళ plan period కు గాను కేటాయించారు ఈ 18 కోట్లు రూపాయలు ప్రజలయొక్క అవసరాలకును, improved methods of agriculture కును, tractors, electric motors మొదలైనవి సప్లయిచేసేందుకును ఇటువంటివాటికి గాను ఖర్చు పెట్టబడుతుందని అందులో వారు సూచించారు ఈసందర్భంలో ఒకవిషయం ముఖ్యంగా చెప్పవలసియున్నది దీన్ని గురించి చాలామంది శాసనసభ్యులుచెప్పారు నేనుకూడ రెండు మూడుసార్లు, ఈబడ్జెట్టుకు వచ్చిన సమయంలో చెప్పాను తక్కావిఋణములున్నూ hire purchasing system ఈ రెండు విధములైన పద్ధతులు ఏమి సరిగా పనిచేయడంలేదు కాబట్టి Agriculture క్రింద ఉన్నటువంటి ఈ రెండిటిని సహకార శాఖకు మార్చినట్లైతే ఏదైన ఉపయోగకరంగా ఉంటుందని అభిప్రాయపడుచున్నాను ఈ తక్కావి ఋణములు ఇవ్వడంలో సుమారు 50 percent లంచాలక్రింద ఖర్చు అయిపోతున్నది ఈ hire purchasing system క్రింద మొత్తము అయిదు ఏళ్ళకు లెక్క వేసుకొన్నప్పటికికూడ ఒక్కొక్క తాలూకాకు 40 motor sets కంటె జాస్తిగారావడానికి వీలుండదు ఇది గూడాఏదో influence ఉండేటటువంటి పెద్దపెద్ద రైతులకు అందరూ ఉంటాయి గాని అవసరముండేటటువంటి పేదవాళ్ళకు అందడం

లేదు Rural credits అభివృద్ధి చేయడానికని ఇప్పుడు సహకారశాఖకు ఎక్కువ డబ్బు కేటాయించారు కాబట్టి ఈ heading క్రిందనే తక్కువ loans కు hire purchasing system కు ఇచ్చేటటువంటి డబ్బుకూడ ఇచ్చి దీనిద్వారా రైతులకు ఇప్పించి నట్లయితే చాలా ఉపయోగకరంగా ఉంటుందని నేను ఉద్దేశపడుతున్నాను

తరువాత Public Health గ్రాంటులో 17 urban పంచాయితీలు ఇంకా కొన్ని మునిసిపాలిటీలు select చేశామని చెప్పారు ఈ 17 urban పంచాయితీలు ఏవో తెలియకుండా ఉన్నది కాబట్టి మంత్రిగారు reply ఇచ్చేటప్పుడైనా వాటిని తెలియజేయ వలసిందని కోరుతున్నాను అంతేకాకుండా ఈ పంచాయితీ areas లో గాని urban areas లో గాని rural areas లో గాని వాళ్ళు water schemes పంపించినప్పుడు వాటికి ఆర్థిక స్తోమతి ఉండినట్లయితే వాటికి అప్పురూపంగా ఈ water schemes చేసుకోడానికి డబ్బు ఇచ్చేందుకు ఈ ప్రణాళికలో అవకాశం ఉన్నదా అని సంశయిస్తున్నాను ఇందులో ఎక్కడా కన్పించడంలేదు కాబట్టి దాన్ని వివరించవలెనని కోరుతున్నాను

The Hon. Sri K VENKATA RAO — 1½ కోట్లు రూపాయలు ఇచ్చామంటే

Sri N C SESHADRI — అంతేకాకుండా ఈ Primary Health Centres విషయంలో సుమారు 25 వేల జనాభాకు ఒక్క hospital చొప్పున అది hospital అనండి లేక dispensary అనండి లేక Primary Health Centre అనండి, ఏదైనా సరే మన ఆంధ్రరాష్ట్రానికి సుమారు వెయ్యి కావలసియుంటుంది అటువంటప్పుడు ఈ hospitals, dispensaries అన్నీ కలిపి 569 మాత్రమే ఉన్నాయి ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో Health Centres 130 ఏర్పాటు చేస్తామని అంటున్నారు అప్పటికీ కూడా 699 మాత్రమే అవుతాయి వీటితో మన అవసరాలు తీరడానికి అవకాశం ఉండదు కాబట్టి ఈ పద్దుక్రింద ఎక్కువ డబ్బు ఇచ్చేందుకు ప్రభుత్వము ఆలోచించవలెనని కోరుతున్నాను కనీసము ఇంకొక 135 Health Centres అయినా open చేస్తే గ్రామాలలో కనీసవైద్య సౌకర్యాలు చేకూరుతాయని భావిస్తున్నాను

Sri L. LAKSHMANA DAS — అధ్యక్షా, ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను తయారు చేయడంలో గౌరవనీయ మంత్రి శ్రీ కళా వెంకట్రావుగారు చాలా పట్టుదలతో ఈ కార్యక్రమాన్ని చాలావరకు నెరవేర్చారు ఇక దీనిని అమలు పెట్టటం అనేది ప్రజలమీద, ప్రజాప్రతినిధులైన శాసనసభ్యులమీద హెచ్చుగా ఆధారపడిఉంటుందని వారు చెప్పడంలో నేను ఏకీభవిస్తున్నాను అయితే ఈ ప్రణాళికవల్ల ప్రథమంగా ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకు, వ్యవసాయికంగా పారిశ్రామికంగా ఎంతవరకు మనము అభివృద్ధిచేసుకోగలము, వ్యవసాయాన్ని అభివృద్ధి చేసుకోవడంలో ఎంతవరకు మనం ముందంజ వేయగలమని చూచినట్లయితే, దీనికి చాలా ఎక్కువ మొత్తాన్ని కేటాయించారని చెప్పవలసి యుంటుంది ఇప్పుడు వ్యవసాయము క్రింద 22 కోట్లున్నూ, irrigation క్రింద కొన్ని కోట్లరూపాయలున్నూ కేటాయించారు కాని వ్యవసాయం ఈనాడు లాభకారి అయిన వ్యవసాయం కాదని చెప్ప

వలసియున్నది ఈనాడు వ్యవసాయం చేస్తున్నారంటే ఇంకొక వృత్తిలేక వ్యవసాయం చేసుకొంటున్నారేగాని వ్యవసాయం చేసుకోవడంవల్ల ఏమాత్రం లాభంలేదు అనేది అందరికి తెలిసిన విషయమే కనుక వ్యవసాయాన్ని అభివృద్ధిచేసుకొంటేగాని, జాతీయ ఆదాయం పెరుగదని స్పష్టంగా తెలుస్తున్నది క్రిందటి పంచవర్ష ప్రణాళిక తయారు చేసినప్పుడు జాతీయ ఆదాయము పెరుగుతుందని మనం భావించాము కాని, ఈనాడు ధరలు పడిపోవడంవల్ల, మన జాతీయ ఆదాయము తగ్గిపోయి, మన economy అంతా upset అయిందనే విషయంలో ఏమాత్రం అభిప్రాయభేదాలు లేవని నేను భావిస్తున్నాను అందుచేతనే irrigation విషయంలో అయిదు ముఖ్యమైన విషయాలు మేము మొదటనుంచీ చెప్తూనే వచ్చాము వాటిని ప్రభుత్వం తప్పకుండా ఆమోదిస్తుందని భావిస్తున్నాను ఈ planning పుస్తకంలో చూస్తే, ఇందులో నాలుగు points ను వారు అంగీకరించినట్లు తెలుస్తుంది Irrigation గురించి, credit గురించి, market గురించి, తరువాత prices యొక్క stability గురించి, ఈ నాలుగువిషయాలుకూడ ఈ పుస్తకంలో వ్రాశారు కాని వీటిని ఎంతవరకు అమలు పరుస్తారని చూచినట్లైతే, irrigation విషయంలో మాత్రము ప్రభుత్వము హెచ్చుగా శ్రద్ధతీసుకొంటున్నట్లున్నది ఈనాడు credit facilities ఏమాత్రంలేవు ఇప్పుడు రైతాంగానికి కావలసిన [illegible] కోట్ల రూపాయలకు, అందులో 5 percent మాత్రమే co operative societies ద్వారాను, ఇతరత్రా ఇస్తున్నట్లు తెలుస్తున్నది

అందుచేత యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేటప్పటికి మనము 18 8% మాత్రమే ఉపయోగించగలమని చెబుతున్నారు ఈ credit facilities లేనిదే, దేశము అభివృద్ధి చెందదు, జాతీయాభివృద్ధి కూడా పొందటానికి అవకాశము వుండదు కాబట్టి, దానికి ప్రత్యేక శ్రద్ధవహించాలి దేనికంటె ముందు మనము వ్యవసాయాభివృద్ధి చేయాలి అనేది మాత్రము ప్రభుత్వానికి గట్టిగా వుండాలి

తరువాత ఈ Planning లో ముఖ్యముగా crop insurance విషయము ఎక్కడా కూడా ప్రభుత్వము ఎత్తుకోనే లేదు నిజంగా పంట సక్రమంగా అందటానికి crop insurance compulsory చేస్తే, దేశానికి చాలా ఆదాయం వుంటుంది తరువాత రైతాంగానికి కూడా పంట విషయములో నష్టంరాదు అనే ధైర్యముకూడా వుంటుంది రైతు కూడా తనయొక్క economy కూడా జాగ్రత్త పరచుకోటానికి అవకాశాలు వుంటాయి ఈ అయిదు points న్నూ సక్రమంగా పెట్టుకోలేనప్పుడు మాత్రము అది జరుగదు మరొక విషయము వున్నది మనది వ్యవసాయక రాష్ట్రం గనుక పశుసంపద వృద్ధి చేసుకోవల్సిన అవసరం ఎంతైనా వున్నది ఈ రోజులలో పశువులను ఏవిధంగా అభివృద్ధి చేస్తున్నాము అనేది నమ్మకము లేకుండా వున్నది రాబోవు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ప్రభుత్వము 2 800 breeding bulls ఆరువేల ఆవులు, తొమ్మదివేల గేదులు, 1500 మేకలు యీ మాదిరిగా సప్లై చేస్తామని అంటున్నారు వీటినన్నిటినీ ప్రభుత్వము ఎక్కడనుంచి సంపాదించి సప్లై చేస్తుంది ? వారివద్దనుంచి అయినా కొంటేనే గదా ప్రభుత్వము వీటిని సప్లై చేయగలుగుతుంది ఇవన్నీ కొనటానికి ఎంత ధనము ఖర్చు చేయాలి ? వీటి నన్నిటిని సంపాదించటానికి Cattle Breeding Stations జిల్లాలలో స్థాపిస్తేనేకాని ప్రభుత్వమునకు యిది సాధ్యపడదు

The Hon Sri K VENKATA RAO —Cattle breeding మాత్రమే కాదు Artificial insemination కూడా చేయించి పశుసంపదను వృద్ధిచేస్తున్నారు

Sri L LAKSHMANA DAS — Cattle ను ఎక్కువ చేస్తున్నారని లెక్కలలో చూపించినప్పటికిని పశుసంపద రోజు రోజుకు ఎక్కువగా క్షీణించి పోతున్న సంగతి ప్రభుత్వము గుర్తించాలి అందుకనే జిల్లా కేంద్రాలలో cattle breeding stations ను ఎక్కువగా పెట్టించాలి ఆ స్టేషనులు పెట్టడమువల్ల వ్యవసాయాభివృద్ధి కావడమే కాకుండా ప్రభుత్వమునకు గూడా అది లాభకరమేనని అనుకుంటున్నాను మనకు ప్రక్క రాష్ట్రముగా వున్న మైసూరు రాష్ట్రానికి cattle breeding వల్ల దమ్మిడి ఏటేట రెండుకోట్ల రూపాయలవరకు ఆదాయము వస్తున్నది మన రాష్ట్రంలో కూడా ఒంగోలు మొదలైన ప్రదేశాలలో మంచి రకాలుగల bulls cows, గేదెలు యిటువంటివి చాలా చిక్కినవి వాటిని జిల్లా కేంద్రాలలోకి సేకరించి అంత ఎక్కువ డబ్బు పెట్టి ప్రభుత్వము కొనలేకపోయినప్పటికినీ, కనీసము co operative basis మీదనో, లేక shares మూలంగానో, అంటే ప్రభుత్వము 50 షేర్లు, ప్రజలు 50 షేర్లు యీవిధంగా కొనిపించి ప్రతి జిల్లాలోనూ పశుకేంద్రాలను స్థాపించి, పశుజాతిని ముందుకు తీసుకోవాలని అంటున్నాను ఆ విధంగా చేస్తే, పశు సంపద వృద్ధికావటానికి ఎన్నో అవకాశాలు వుంటాయి

తరువాత విద్యావిషయములో తక్కిన విషయాలలో కూడ, మంత్రిగారు ప్రభుత్వ ఆదాయాన్ని పెంచటానికి పథకాలు తయారుచేశారు ఆదాయాన్ని ఎక్కువగా వృద్ధిచేసుకోటానికి మన దేశములో అవకాశాలు లేకపోలేదు అమ్మన్నరాజా గారు యీ సమయములో యిక్కడ లేరు రాబోయే ద్వితీయ పంచవర్ష ప్రణాళికను నిర్వహించటానికి మనకు కావలసిన డబ్బు సేకరించడమనేది నిజంగా ఆడవాళ్ళు పూనుకుంటే డబ్బు సేకరించడములో చిక్కు ఏవిధంగాను కనబడదు ఆడవాళ్ళు పూనుకుంటే, మనకు కావలసిన 2½ కోట్లే కాదు, అయిదువందల కోట్లు అయినా సంపాదించ గలరని నాకు నమ్మకము వున్నది ఈనాడు మన రాష్ట్రములో ఆడవాళ్ళ వద్ద నున్న బంగారపు నగలు అన్ని విలుకట్టిన ట్లయితే, ఎన్నో కోట్లు ఖరీదు గలదిగా వున్నది ఇప్పుడు బంగారము కు ఖరీదు ఎక్కువగా వున్నది ఈ సమయములో ఆ నగలన్నీ కూడా అమ్మి ప్రభుత్వానికి అప్పుగాయిచ్చే పక్షములో మనకు తప్పకుండా యీ డబ్బు సేకరింపు చాలామట్టుకు solve అయిపోతుంది రాబోవు రోజులలో మనకు బంగారము ఎంతో మిగిలివుంటుంది చాలా చౌకకూడా అవుతుంది అప్పుడు యింకను రెండింతలు నగలు సేకరించవచ్చును అటువంటి మంచిరోజులు మనకు వస్తాయి గనుక స్త్రీలు ప్రముఖపాత్ర యీ విషయములో వహించాలని అంటున్నాను స్త్రీలయందు పురుషులు అభిమానము చూపడము లేదని ఈ మధ్యనే మన ఎసెంబ్లీలో అమ్మన్నరాజాగారు అన్నారు అసంభవము అది కాదు వారు ఆవిధంగా తలంచటానికి అవకాశాలు నిజముగా లేవు ఈనాడు మన దేశములో యీ plan వల్ల దేశాన్ని అభివృద్ధిపరచుకుంటే, దేశంలోవున్న ప్రతి పౌరుడున్నూ తను సంపాదించుకున్న దంతా కూడా, అతని భార్యబిడ్డలతో సుఖసంతోషముగా నివసించటానికే గదా అనేది గుర్తించవలెనని కోరుతున్నాను ప్రభుత్వముకూడా

(Sri L Lakshmana Das) [4th August 1955

యిదేవిషయాన్ని దృష్టిలోపెట్టుకొనే దేశాన్ని అభివృద్ధి చేయదలుచుకున్నామని సమ్మిళిత
ఆర్థికాభివృద్ధికిగాను ప్రభుత్వము యీ రాబోవు ద్వితీయ పంచవర్ష ప్రణాళికను
అమలుపరచ సంకల్పిస్తున్నది ఈ ప్రణాళికను జయప్రదము చేయుటకు దేశములోని
పురుషులు, స్త్రీలు అన్నివిధాలా తోడ్పడాలని అంటున్నాను ఆవిధంగా చేస్తే మనము
యీ [illegible] లో ఎంతో ముందుకు రావచ్చును ఈ ప్రణాళికకు గాను కావలసిన ధనము
ప్రజలనుండి ధైర్య సాహసాలతో సేకరించటానికి మనమందరము పూనుకోవాలి
ప్రథమ పంచవర్ష ప్రణాళిక సమయములో దానియొక్క ప్రయోజనాలను మనము వినియో
గించుకోలేక పోయినాము ఈ ప్రణాళికలో చెప్పబడింది చదువుచున్నాను

A State which to some extent has missed the fullest opportunity during the First Plan and the resources of which have not been adequately developed till now can under a planed economy justifiably have a programme of development comparatively bigger in scope than what its internal resources alone would warrant ' —

అందుచే, మనకు వున్న అవకాశాల ద్వారా యీ 280 కోట్లే కాకుండా, యింకను విలువయినంత ధనాన్ని సేకరించటానికి, యింకా పెద్ద పెద్ద plans వేయుటానికి అవసరము వచ్చినప్పుడు, ఆంధ్రదేశములోని ప్రతి ఒక శాసన సభ్యుడు కూడా మన దేశానికి యీ ప్రణాళికకు గాను కావలసిన అప్పు యివ్వటానికి ప్రజలలో తగిన వాతావరణము కలిగించవలసిందిగా కోరుతున్నాను ఇంకను మన రాష్ట్రము నూతనముగా ఏర్పడ్డది అందువల్ల మన రాష్ట్రముకూడా యితర రాష్ట్రాలకన్న వెనుకబడకుండా ముందంజ వేయుటానికి వీలుగా యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సంపూర్ణముగా జయప్రదము చేయాలని సభ్యులందరిని కోరుతున్నాను Planning మంత్రిగారు ఎంతో ఉత్సాహముతో చాలా శ్రమపడి దీన్ని తయారుచేశారు కాబట్టి మనమందరము దీన్ని ముందుకు తీసుకొని పోవటానికి తోడ్పడాలి ద్వితీయ పంచవర్ష ప్రణాళికను మంత్రిగారు ఎంతో దృఢనిశ్చయంతో సాధిస్తారని ఆశిస్తూ, భగవంతుడు వారికి మనకు సహాయపడాలని కోరుతూ విరమిస్తున్నాను

Sri M RANGAYYA — Mr Speaker Sir, I rise to congratulate the Hon Minister for Planning and Industries for the broad understanding and outlook he has brought to bear on this question of planning I wish to speak specially on three or four specific and select subjects Andhra is vastly an agricultural country and 70 per cent of the population lives on agriculture Nature has beautifully endowed us with rich resources of water and if we are able to harness our water resources properly and usefully, we can get lakhs of acres under irrigation and we can also generate electric power sufficient to meet our needs and the Hon Minister for Planning has rightly

4th August 1955] (Sri M Rangayya)

laid stress upon these two important aspects in the Second Five Year Plan Incidentally with generation of more electric power, industries also can be helped

In the draft plan, tentatively about Rs 240 0 crores have been allotted For agriculture animal husbandry and irrigation which are correlated, about Rs 80 0 crores have been allotted, for electricity, and industries which are correlated, about Rs 50 0 crores have been alloted, and for medicine and public health which are again correlated, about Rs 16 0 crores have been allotted Therefore, Sir when agriculture and land are improved and food production is increased, and new industries are established the per capita income of the State will increase and this paves the way for social justice and for lessening of unemployment and also for the realization of a socialist State In this respect the Hon Minister for Planning has rightly, under several items of expenditure dovetailed one into the other so as to fit into the general picture of a socialistic State In this connection, I have to make special mention about agriculture. Food production has been raised from 44 lakhs of tons to 52 lakhs of tons, under irrigation the present area of 30 lakhs of acres is being raised to 38 lakhs of acres in the next five years In regard to electricity the present per capita consumption is about 10 units and it is sought to be raised to 20 units after five years At the same time industries also are being encouraged In this connection I am doubly gratified to note that the production of handloom cloth is being raised from 204 lakhs of bales to 467 lakhs of bales during these five years and this is a marked improvement Incidentally, textile mills also are being started in the State Here I wish to sound a note of warning We must not over encourage textile industry because it will hit the handloom industry With regard to animal husbandry which is correlated to agriculture, sufficient care is being taken, livestock is sought to be improved, a new veterinary college is being opened at Bapatla and also 16 poultry centres are being opened in Andhra Desa to increase the nutritive value of food we take In regard to medicine and health also, two medical colleges are about to be opened one at Kurnool and the other at Tirupati, one Ophthalmic hospital is being started at Guntur besides a Women and Children

Hospital a laboratory of the type of King Institute Guindy at Madras, is going to be opened in the Andhra State The number of primary health centres is going to be raised from 25 to 130 and the bed strength is also going to be raised from 7200 to 9600 viz , nearly 33 per cent rise in five years

This is all a considerable improvement on the previous state of affairs The Hon Minister for Planning has carefully dovetailed all these items of expenditure so as to bring about a socialistic State My friends on the other side feel that this five year plan is only a vote catching device It is very unfair Anybody can do any good thing If we do any public service it should not be immediately dubbed as a vote catching device Friends on the other side also may start such vote catching devices instead of threatening and bullying the lay public

Sri S BRAHMAYYA — గౌరవనీయులైన అధ్యక్షా ! గౌరవనీయులైన ప్రణాళికామంత్రి శ్రీ కళా వెంకటరావుగారు ప్రతిపాదించినటువంటి ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ముసాయిదా పథకాలు శ్రేయోరాజ్యస్థాపనకు నాందీ ప్రస్తావనగా వున్నాయని అనుకోవడములో ఏమీ ఆశ్చర్యములేదు నూటికి 70 వంతులు జనాభాలో వుండి ఎక్కువ సదుపాయము లేకుండా వెనుకబడివున్నటువంటి గ్రామాలను దృష్టిలో వుంచుకొని, గ్రామీణ ప్రజలను దృష్టిలో వుంచుకొని ఈ పథకాలు తయారుచేయబడ్డాయి అందుకు కళా వెంకటరావుగారు ప్రశంసాపాత్రులు, అభినందనీయులు

పల్లెపల్లెకు ప్రతి పట్టణములో కూడా ఏదో ఒక విధమైనటువంటి సహాయము, సౌకర్యము కలిగించాలనేటటువంటి వుద్దేశ్యముతో ఈ పథకము తయారుచేయబడింది ముఖ్యముగా గ్రామీణ ప్రజలకు రైతులకు వ్యవసాయక అభివృద్ధికి కావలసిన సదుపాయాలు కలిగించడము, అంతేకాకుండా ఈ గ్రామీణ ప్రజలకు నిత్యము అవసరమైనటువంటి విద్య, వైద్యము, ఆహారము, విద్యుచ్ఛక్తిసరఫరా, నీటిసరఫరా మురుగునీటిసదుపాయాలు ఇంకా రోడ్లు మున్నగు అన్ని సౌకర్యాలు కూడా కలుగజేయడానికి ఈ పథకము తయారుచేయబడింది ఇది చాలా సంతోషకరమైన విషయము ముఖ్యముగా ప్రథమ పంచవర్ష ప్రణాళికలో చూపబడినటువంటి తుంగభద్ర ఎగువకాలువ, నందికొండ నిర్మాణాలే కాకుండా ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో వంశధార, పులిచింతల, సిద్ధేశ్వరము మొదలగు మేజరు ఇరిగేషను స్కీములు, గోదావరి రిజర్వాయరు, పెన్నా గుడాము మొదలగు వరద నివారణ స్కీములు ఇవన్నీ కూడా రాష్ట్రీ అభ్యుదయానికి స్వాతోముఖాభివృద్ధికి కూడా దోహదముగా కన్పిస్తున్నవి ఈ నందికొండ పటము చూచే భాగ్యము నాకు లభించింది ఆ నదీ జలాలు పొంగి పొరలుతూ లక్షలాది ఎకరాలను సస్యశ్యామలము చేస్తుంటే ఎంతో కనులపండుగగా వున్నది ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పూర్తిఆయేసరికి ఈ 28 లక్షల 80 వేల ఎకరాలనుంచి 38 లక్షల 40 వేల ఎకరాలవరకూ ఆంధ్రరాష్ట్రములోని భూమి సాగవుతవని చెప్పబడింది ఇది మన అందరికీ కూడా చాలా సంతోషకరమైన విషయము నేను ఈ సందర్భములో 1, 2 విషయాలు మాత్రము సూచించదలచుకొన్నాను (1) విద్యా విధానములో

ప్రధానమైన విషయము నూటికి 100 గురును విద్యావంతులుగా చేయాలనే వుద్దేశ్యము ప్రభుత్వానికి కూడా వున్నది అలాగే ఈ ప్రణాళికా మంత్రిగారికి కూడా ఆ వుద్దేశ్యము వున్నది ఇందులో హరిజనుల సంక్షేమము వెనుకబడినజాతులవారికి కూడా విద్యాసౌకర్యాలు అన్నివిధాలా కలుగజేయడానికి ప్రభుత్వము సంకల్పించివున్నారు అదేవిధంగా ఆర్థికంగా వెనుకబడివున్నటువంటి జాతులకు విద్యాసౌకర్యములు కలుగ చేయాల్సిన అవసరము వున్నదని నేను మనవిచేస్తున్నాను ఎందుచేతనంటే వెనుకబడిన జాతులవారిలో కొంతమందికి ఆర్థికస్తోమత వుండికూడా వుచిత విద్యా సౌకర్యము, వుచిత భోజన సౌకర్యముకూడా కలుగుతోంది ఉదాహరణకు చెప్పాలంటే చాలా వున్నాయి 50, 60 వేలు రూపాయలు పెట్టుబడిపెట్టి వ్యాపారము చేసుకుంటూ, మేడలు మిద్దెలు కలిగివున్నవారి అబ్బాయిలకు విద్యాసౌకర్యము, భోజన సౌకర్యము కలుగుతున్నవి కాని ఈ వెనుకబడిన జాతులు కాకుండా సవర్ణ కుటుంబాలకు ఆర్థికంగా వెనుకబడి వున్నవారికి ఆకలి మంటలతో వెనుకబడి వున్నవారికి ఈ విద్యా సౌకర్యము ఏమీ కూడా కలుగచేయబడలేదు ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోనైనా అటువంటి సదుపాయము కలుగచేసినట్లయితే దేశానికి ఎంతో శ్రేయస్కరంగా వుంటుంది అది యావత్ కళ్యాణానికికూడా ఎంతో శ్రేయస్కరంగావుంటుందని మనవి చేస్తున్నాను ఇటువంటి సదుపాయము తప్పకుండా కలుగచేస్తారని ఆశిస్తున్నాను

కోఆపరేషనుకు ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 12 కోట్ల రూపాయిలు చూపబడ్డాయి ఇందులో ఇంతవరకు రైతులకు భూములమీద తనఖాలు పెట్టితే ఆ తనఖాలమీద కొద్దో, గొప్పో అప్పులు ఇస్తున్నారు ఈ భూములు లేనటువంటి కేవలం ఇళ్ళు కలిగినటువంటి రైతులకుగాని సామాన్య ప్రజలకుగాని ఈ బ్యాంకులద్వారా ఏమీ సదుపాయము కలుగజేయడములేదు ల్యాండ్ మార్ట్గేజిబ్యాంకులతోపాటు, హౌసు మార్ట్గేజి బ్యాంకులను కూడా స్థాపించాలని మనవి చేస్తున్నాను సామాన్యమానవుడు కొద్దో గొప్పో బ్యాంకులద్వారా అప్పు తెచ్చుకోవాలంటే వారికి తెచ్చుకోడానికి అవకాశం లేకుండా పోతోంది

Mr SPEAKER —టయిము అయింది

Sri S BRAHMAYYA — ఒక్క విషయముకూడా మాట్లాడిందిలేదు అప్పుడే బెల్లుకొట్టేస్తున్నారు మీరు బెల్లుకొడుతుంటే నేను చెబుతాను అని వచ్చింది కూడా మరచిపోతున్నాను ఈ టయిము సరిపోదండి

Mr SPEAKER —ఒక్కనిముషము తీసుకోండి

Sri S BRAHMAYYA — ఒక్కనిముషము చాలదండీ మానేయమంటే మానేస్తాను

House Mortgage Banks ను కూడా స్థాపించాల్సిన అవసరమువున్నదని మనవిచేస్తున్నాను పట్టణములలో అర్బనుబ్యాంకులు అనేవి వున్నాయి ఈ అర్బను బ్యాంకులు ఈ సెంట్రలుబ్యాంకుల నుంచి ఏ 10 వేల రూపాయలుమాత్రమే సంవత్సరానికి అప్పు ఇస్తున్నవి అక్కడవున్న డైరెక్టర్సు 10, 15 వేలు మాత్రమే డిపాజిటు యిస్తూవుంటారు ఆడబ్బు ఏ మాత్రముకూడా ఆపట్టణములో వున్నటువంటి సామాన్య

ప్రజలకు సరిపోయే మునిసిపాలిటీలలో డబ్బు చాలా వుంటుంది ప్రావిడెంటుఫండ్లో లేక మరొకవిధమైనటువంటిఫండ్లో అనేది అవన్నీకూడా fixed deposit ల ద్వారా స్టేటుబ్యాంకులలోను సెంట్రలుబ్యాంకులలోను వేసుకొనేఅవకాశంమాత్రము ప్రభుత్వం వారికి కల్పించితే ఆ మునిసిపాలిటీలు కొన్ని ఈ బ్యాంకులలో కనీసము 10 20 వేల రూపాయలు అయినా సాధారణముగా సంవత్సరానికి fixed deposit చేసివున్నట్లయితే ఈ [illegible]బ్యాంకులు అన్నీకూడా సామాన్య ప్రజానీకానికి అందరికీ ఆర్థికసహాయం చేయడానికి అవకాశము వుంటుంది ఈమధ్య సంచారబ్యాంకులు అని పెట్టుటలో ఇంపీరియల్ బ్యాంక్ చేస్తున్నాయి ఇటువంటి సంచార బ్యాంకులవల్ల రైతులకు వచ్చే యిబ్బంది తగ్గుతుంది పైసిడర్లను, వృద్యోగస్తులను పదేపదే అడిగి ఎన్నో పర్యాయాలు తిరిగే కష్టము పోతుంది సంచారబ్యాంక్సుద్వారా అప్పులు ఇవ్వటంలో వారికి దగ్గరనిఅవకాశాన్ని ఎక్కువసదుపాయాన్ని కలుగజేసినటువంటివారు అవుతారని కూడా నేను మనవిచేస్తున్నాను

ఆరోగ్యవిషయము ఒకటి వున్నది నేను ఇదివరకుకూడా దీనివిషయము మనవి చేశాను శరీరమాద్యం ఖలుధర్మసాధనం అనేటటువంటి ఆర్యోక్తిని దృష్టిలోవుంచుకొని ఎక్కువ మందులు మాకులతో నిమిత్తములేకుండా ఆస్పత్రులను స్థాపించడమే కాకుండా ఈ ఆంధ్రదేశంలో వున్నటువంటి వ్యాయామశాలలను పూర్తిగా ప్రోత్సహించి తగినటువంటి ఆర్థికసహాయముకూడా ప్రభుత్వమువారు కలుగచేయవలసిందిగా మనవిచేస్తున్నాను

Sri P VENKATASWAMI REDDI — అధ్యక్షా! ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను తయారుచేయడములో దేశముయొక్క పునర్నిర్మాణమును అనుసరించి సమగ్రమైన పరిశీలన జరిపి శ్రీ వెంకట్రావుగారు ఎంతో శ్రద్ధతీసుకొని ఈ ముసాయిదా మనకు అందజేసినందుకు మీ ద్వారా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను ఈ మంత్రిగారే న్యాయ మంత్రిగా వున్నప్పుడు జమీందారీ ప్రాంతములు చాలా వెనకబడి ఉన్నవని అచ్చట ఉన్న ప్రజానీకము అభివృద్ధి లేకుండా బాధపడుచున్నారని చెప్పి వారిని సంస్కరించుటకు జమీందారీలను రద్దుచేసిన మహనీయులు ఈనాడు ప్రణాళికా మంత్రిగా ఉండి అటువంటి వెనుకబడిన ప్రజానీకమును దృష్టిలో పెట్టుకొని జమీందారీ ప్రాంతములలో అక్కడవున్న ప్రజలకు సరైన ప్రాతినిధ్యము ఇచ్చి అటువంటి చోట్ల అభివృద్ధి కరమైన పనులు కల్పించడములో మీరు శ్రద్ధ వహిస్తారని నేను ఆశిస్తున్నాను ఈ ప్రణాళికయొక్క ప్రధాన సూత్రములలో ముఖ్యముగా ఈ గ్రామ కార్యక్రమము కొనసాగవలెనంటే ప్రజలవద్దనుండి half contribution వస్తేనేతప్ప ఏ కార్యక్రమము కొనసాగించడానికి వీలులేని పరిస్థితులలో ముఖ్యముగా వెనుకబడిన ప్రాంతములలో half contribution అనేది 4 వ వంతు అయినప్పటికీ తగ్గిస్తేనేతప్ప ఏదైనా అభివృద్ధి ఒక ఊరిలోకూడ కొనసాగదు ఈ ప్రణాళిక క్రింద 24 కోట్లు ఖర్చుపెట్టడానికి కేంద్రప్రభుత్వముఎంతవరకు ఆమోదము తెలియజేస్తారో కాని ఏ విధముగానైనను కొంత తగ్గిస్తారని ఆందోళనగా నున్నది అటువంటప్పుడు ఈ ప్రణాళిక పునః పరిశీలన చేయవలసిన సందర్భములలో ఈ వెనుకబడినప్రాంతాలకు ఏవిధమైన తగ్గింపులేకుండా వీటిని దృష్టిలోపెట్టుకొని కొనసాగిస్తారని ఆశిస్తున్నాను ఈగ్రామములయొక్క అభివృద్ధి విషయములో ముఖ్యముగా industries స్థాపన చేయడములో ఈ వెనకబడిన ప్రాంతములో ముఖ్యముగా జమీందారి ప్రాంత

ములో జరగా దారిద్ర్య అయిన రకమైన అక్కడవున్న ప్రజానీకము కు ముఖ్యముగా కలిగించాయి ఉన్నటువంటి headquarter పట్టణములలో జీవనభృతిపోయి ఏవిధ మైనగా వృత్తులు లేకుండా బాధపడు చున్నారని మంత్రిగారికి అనేకసార్లు విన్నతి పత్రముల ద్వారా తెలుపుకొని ఉన్నారు ఈ జిల్లాలలో medium size industries ను ప్రభుత్వము స్థాపిస్తారని హామీ యిచ్చిఉన్నారు కనుక అటువంటి వెనుకబడిన ప్రాంతములలో ప్రజలకు పని కల్పించేందుకు ఆ విషయము దృష్టిలో పెట్టు కొని అటువంటి ప్రాంతములలో ఆ కేంద్రములు నెలకొల్పాలని ఆశిస్తున్నాను ముఖ్యముగా ఈ irrigation సంబంధములో కొన్ని పెద్ద ప్రాజెక్టులు విషయము (గోసరిల) ప్రణాళికలో పొందుపరచినట్లు గోచరించడము లేదు అది దాదాపు 5 లక్షల ఎకరములు సాగులోకి తీసుకురావడానికి అదిగాక ఈ వెనకబడిన ప్రాంతములకు దాని వల్ల చాలా నీటివసతులు కలుగుతవి కనుక ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో దానికి అవకాశము యిచ్చి దానిని కార్యరూపములో రూపొందిస్తారని ప్రార్థిస్తున్నాను

Sri M RAJESWARA RAO — అధ్యక్షా! గత సమావేశములో గవర్నరుగారి ఉపన్యాసములో త్వరలోనే రాష్ట్ర అభివృద్ధికొరకు రెండవ పంచవర్ష ప్రణాళిక తీసుకువస్తామని చెప్పారు దానికి అనుగుణముగా బహు కొద్దికాలములో సమగ్రమైన ప్రణాళిక ఈనాడు సభ్యులముందర ఉంచినందుకు ప్లానింగు మంత్రిగారిని అభినందించవలసియున్నది అయితే, ఈనాడు పంచవర్ష ప్రణాళికలో ముఖ్యముగా రూపొందించవలసిన ఉద్దేశ్యము ఏమిటో స్పష్టంగా చెప్పారు ముఖ్యముగా దేశ ఉత్పత్తిని అధికముచేయడము, జాతీయ ఆదాయమును అధికముచేయడము, రెండవది నిరుద్యోగ సమస్యను పరిష్కరించడము అని చెప్పారు, అయితే ఈ రెంటిని కార్యరూపములో తీసుకు వచ్చుటకు ఈ పుస్తకములో ప్రభుత్వము రూపొందించిన కార్యక్రమము ఏమిటి అన్నది యీనాడు మనకు జాగ్రత్తగా ఆలోచించవలసినవిషయము ముఖ్యముగా ఈనాడు ఆంధ్రరాష్ట్రము ఎక్కువగా వ్యవసాయముమీద ఆధారపడి ఉన్నది కాబట్టి వ్యవ సాయముమీద ఎక్కువడబ్బు వేయించినట్లు వారు చెప్పారు దాదాపు 130 కోట్ల రూపాయలులో ఇందులో 24 కోట్లరూపాయలు కేటాయించినట్లు కన్పడుతూ ఉన్నది అయితే వ్యవసాయమును అభివృద్ధిచేయడములో ప్రభుత్వము కొన్ని చిక్కులను ఎదుర్కొనవలసివస్తుందని అనుకుంటున్నాను భూసంస్కరణలు తీసుకురావడమువల్ల కౌలుదారీచట్టము తీసుకురావడమువల్ల రైతులకు ఋణములుయివ్వడమువల్ల వ్యవసాయమును అభివృద్ధిచేయగలమని ఉత్పత్తిని అధికముచేయగలమని వారు చెప్పారు కాని అసలు మన Constitution లో మార్పు రానంతకాలము తొందరలో ఈ భూసంస్కరణలను తీసుకురాగలము అనేది సందేహముగా నున్నది Constitution లో ప్రతి ఒక్కరు కూడా తమతమ ఆస్తులను సంపాదించుకొనుటకు వారికి అధికారము ఉన్నది ఈనాడు తమరు ceiling పెట్టి ఎంతభూమి ఉంచుకోవాలి, ఇంతకంటే మీరు ఉంచుకోకూడదు అని నిర్ణయముచేయడానికి మనకు అధికారమున్నదా? అధికారము లేనట్లయితే కేంద్రమును అర్థించి త్వరలోనే Constitution Act కు amendment తీసుకు రావడము అవసరమవునా కాదా అనే విషయమును జాగ్రత్తగా ఆలోచించవలెనే భూసం స్కరణలను తీసుకురావడానికి అవకాశము ఉన్నదని భావించను అందుచేత ముఖ్యంగా భూసంస్కరణలను సంవత్సరములోపల తీసుకువస్తాము అని చెప్పేముందు Constitution గురించి ఆలోచించమని మనవి చేస్తున్నాను తరువాత ఈ వ్యవసాయము అభివృద్ధి

కొరకు చాలా irrigation ప్రణాళికలను మేము తీసుకువచ్చాము అని దానికి 65 కోట్ల రూపాయలు కేటాయించాము అని చెప్పారు ఈ irrigation ప్రణాళికకు సంబంధించిన ఒక విషయమును ప్రభుత్వమునకు చెప్పదలచుకున్నాను మొట్టమొదట ఈ స్కీమును 2 భాగములుగా చూపించారు అందులో ఒకటి మనవిచేయవలసియున్నది ముఖ్యముగా ఈనాడు మనము క్రొత్త ప్రాజెక్టులను కట్టడానికి పూనుకొన్నప్పుడు ఆ ప్రాజెక్టుల ద్వారా ఎక్కువభాగమును వ్యవసాయ అభివృద్ధిలోకి తీసుకురావడానికి అవకాశము ఉన్నదా లేదా అన్న విషయము ప్రభుత్వము గుర్తించాలని మనవి చేస్తున్నాను ఈనాడు నందికొండ ప్రాజెక్టును నిర్మించవలెనని అనుకుంటున్నాము నందికొండ ప్రాజెక్టుక్రింద త్రవ్వవలసిన కాలువలను ఎక్కువ పొడిగించినట్లయితే మనము పులిచింతల రామపాదసాగర్ ప్రాజెక్టులవల్ల వచ్చే అభివృద్ధి సాధించగలమో లేదో గుర్తించాలని మనవిచేస్తున్నాను ఒక రాయలసీమలో ఈవేళ సిద్ధేశ్వరము కానీయండి సోమశిల కానీయండి ఇక్కడనున్న K C canal క్రింద తుంగభద్ర ప్రాజెక్టుక్రిందనున్న area ఇంతవరకు సాగులోకి వచ్చిందా ? సాగులోకి తీసుకురావడానికి అవకాశమున్నదా, లేదా? లేనప్పుడు మనము యితర ప్రాజెక్టులను తీసుకురావలసిన అవసరమున్నదా అనే విషయము ప్రభుత్వము ఆలోచించకుండా ఏదో ప్రాజెక్టు కావాలి అనే దృష్టితోటి డబ్బుఖర్చుపెట్టినట్లయితే ఏమౌతుందో మనము ఆలోచించవలసి యున్నది ఏమనగా, తుంగభద్ర ప్రాజెక్టుక్రింద ఎన్నో లక్షల ఎకరములు సాగుఅవుతుందని మనము ఆశించినా 8 వేల ఎకరములకంటె ఎక్కువ సాగుకావడములేదని మంత్రిగారు చెప్పితే చాలా ఆశ్చర్యము వేసినది అదేవిధముగా ఈ నందికొండ ప్రాజెక్టుయొక్క ఎత్తును 10 అడుగులు పెంచినట్లయితే దాదాపు రామపాదసాగర్ ప్రాజెక్టుకూడా ఇంతలో అవసరము లేనట్టి స్థితిలో మనము వ్యవసాయము చేసుకోవడానికి అవకాశము ఉన్నదనికూడా రుజువు చేసుకోవలసిన అవసరము ఉన్నది అందుచేత ప్రభుత్వము క్రొత్త ప్రణాళికలను వేస్తూ వున్న ప్రణాళికల క్రింద మనము ఎక్కువ సాగు చేయడానికి అవకాశము ఉన్నదా లేదా అని ఆలోచించినతరువాత ఒక నిర్ణయమునకు వచ్చినతరువాత క్రొత్త ప్రాజెక్టులను తీసుకోవాలి గాని రాజకీయ కారణములను మనసులో పెట్టుకొని ఇతర ప్రాజెక్టుల విషయములో తొందర పడకూడదని మనవిచేస్తున్నాను వ్యవసాయమునకు సంబంధించిన ఇంకోమాట ఈనాడు అప్పుడే ధాన్యపుబస్తా 16 రూపాయలు ధర వచ్చినదని 10 రూపాయిలకు ధర తగ్గుతుందని చాలా ఆందోళన పడుచున్నారు అలాంటి సందర్భములో రేపు నందికొండ ప్రాజెక్టు పూర్తిఅయితే అప్పుడు బస్తా 5, 6 రూపాయలకు వస్తే అప్పుడు వ్యవసాయము చేసుకోవాలనేవారు ఉంటారా అనే అనుమానము నాకు ఉన్నది అందువల్ల భూమి కావాలనేవారు లేనప్పుడు వ్యవసాయము ఎక్కువ చేయాలనేవారు లేనప్పుడునిజముగా దేశములో ఒక ప్రమాదము వస్తుందని ప్రభుత్వము గుర్తించినట్లయితే ఈ ధరలు పడకుండా ఉండటముకోసము ప్రభుత్వము ఏదైనా ఒక పథకమును రూపొందించవలసి వుంటుందని మనవిచేస్తున్నాను ముఖ్యముగా commercial crops ను raise చేయాలి Commercial crops ను raise చేసే పక్షంలో దానికి మార్కెటు ఉన్నదా లేదా మార్కెటు ఉన్నట్లయితే private వ్యక్తులు దానిని అమ్ముకోడానికి అవకాశము ఉన్నదా లేదా అని ఆలోచించవలసిన అవసరం ప్రభుత్వమునకు ఉన్నది ఈనాడు పొగాకు, మిరపకాయ గురించి రైతులు గత 2 సంవత్సరాలుగా పడిన బాధ

4th August 1955] (Sri M Rajeswara Rao)

చూస్తే చాలా దారుణముగా ఉన్నది అందుచేత ప్రభుత్వం ఒక Commercial Corporation పెట్టించి దానిని వ్యాపార సంస్థగా ప్రభుత్వము స్థాపించి, private capital ను కూడా తీసుకొని, ప్రభుత్వ అజమాయిషీ క్రింద యీ Commercial Corporation ను నడిపించినట్లయితే (ware houses ను కట్టించి) రైతులు ఇంత బాధ పడనక్కరలేకుండా పోతుంది అప్పుడు వాణిజ్యపంటల వ్యాపారమునకు చాలా దోహదము యిచ్చినవారమౌతామని మనవిచేస్తున్నాను

ఇకపోతే unemployment గురించి ప్రభుత్వము పరిశ్రమలకు ఎక్కువ ప్రాధాన్యత యిస్తాం అని చెప్పారు ఇందులో చూచినట్లయితే దాదాపు 11 కోట్ల రూపాయలు కేటాయించినట్టు కనబడుతున్నది ఐతే ఏ రూపంలో యీ పరిశ్రమలను నడిపించాలి అనేది చాలా జాగ్రత్తగా ఆలోచించవలసిన విషయం ఈ నాడు పరిశ్రమలను private వ్యక్తుల చేతులలో పెట్టినట్లయితే దానిలో shareholders గా పాల్గొనడానికి చాలమందికి యిష్టంలేదు వారిమీద నమ్మకం లేక ఎన్ని wind up అయిపోతున్నాయో, ఎన్ని liquidate అయిపోతున్నాయో మనం చూస్తున్నాం అందుచేతనే—

The Hon Sri K VENKATA RAO — అది ఒక ఆంధ్రదేశములోనే మిగిలినచోట్ల బాగానే నడుస్తున్నాయి

Sri M RAJESWARA RAO — అది ఆంధ్రదేశములో వున్నటువంటి పరిస్థితుల ప్రకృతి అలాగుందని అనుకొంటున్నాను అందుచేత నేను suggest చేసేది యేమిటంటే ఆంధ్రదేశంలో మీరు ప్రత్యేకంగా Industrial Corporation ఎందుకు పెట్టుకో కూడదు? ప్రభుత్వం share ధనాన్ని తన అజమాయిషీ క్రింద వుంచుకో వచ్చునని ప్రభుత్వానికి సూచిస్తున్నాను తరువాత నిరుద్యోగ సమస్య తీసుకుందాము ప్రస్తుత విద్యా విధానములో మార్పు రానంతకాలం ఈ నిరుద్యోగ సమస్య తీరదని నేను గట్టిగా మనవి చేస్తున్నాను ఇతరులపై ఆధారపడకుండా స్వయంగా జీవనోపాధి సంపాదించుకో డానికి దారి వుందని ప్రభుత్వం ఆలోచించినట్టుగా కనపడక పోవడం శోచనీయం అందుచేత ఈ నిరుద్యోగ సమస్య విషయంలో ప్రభుత్వ విద్యా విధానంలో మార్పు తీసుకురావడానికి ప్రయత్నం చేయాలి చివరగా చెబుతున్నాను ఈ ప్రణాళిక జయప్రదంగా అమలు జరపాలంటే administrative machinery లో సంస్కరణ తీసుకు రావాలి ఈ administrative machinery ఎలాగున్నదంటే ప్రభుత్వ ఖాదీ స్టోర్సులో 3 గజాల ఖాదీగుడ్డ కొనడానికి 2 గంటలు అక్కడ ఆగాలంటే ప్రభుత్వం ఏ విధంగా industries నడిపిస్తుంది? ఏ విధంగా వ్యాపారం నడిపిస్తుందో నాకు చాలా ఆశ్చర్యకరంగా వున్నది కనుక ప్రభుత్వం యీ విషయంలో జాగ్రత్తగా సంస్కరణలు చేయవలసిన అవసరం వుందని మీకందరికీ మనవి చేస్తున్నాను ప్రభుత్వంలో సంస్కరణ తీసుకురావాలి ఉద్యోగస్థులలో మార్పు తీసుకురావాలి అది లేనంతవరకు ఈ ప్రణాళికలు జయప్రదం కావు అప్పుడే Madras Government వారు services ను reorganize చేయడానికి ఒక కమిటీవేశారు నిన్న అసెంబ్లీ ప్రశ్నోత్తరాల సమయంలో village officers లో మార్పు తీసుకు వచ్చేందుకు పథకాలు రూపొందించ బడుతున్నవని సమాధానం చెప్పారు Party meeting లలో మేము దెబ్బలాడినా, ఈ అసెంబ్లీలో ఎంతమంది కొట్టుకున్నా

యిదిగో ఒక కమిటిని వేయబోతున్నాం, యిదిగో సలహాలు తీసికోబోతున్నాం అనే ప్రకటనలు చేయడంవల్ల ప్రభుత్వానికి యాభిప్రాయం వున్నదా లేదా అని నేను చాల వరకు బాధపడుతున్నాను ఈ నాడు administration క్రింద 52 19 percent ఆదాయమును ఖర్చుపెడుతున్నాము ఇప్పుడు ఉన్న administration ద్వారా సాధ్యపడదు. అందుకోసం యిదిగో యీ విధంగా కమిటిని వేయబోతున్నాము అని ఒక statement యివ్వాలి అది లేకుంటా మన ప్లాను successful గా జరుగదని నేను మనవి చేస్తున్నాము

Sri B V SUBBA REDDI — Mr Speaker, Sir, let me join the chorus of several hon Members complimenting and congratulating the Hon Minister for Planning and Industries on the very great achievement he has certainly contributed in getting this draft second five year plan ready within a short time Let me say Sir, that we are exceptionally fortunate in that the Hon Minister has been entrusted with the portfolio of Planning and Industries because all of us know that he is a gentleman who is gifted with a keen and sharp intellect he is known for his scheming and planning not only politically but industrially as well as irrigationally I am sure, Sir that under his leadership and guidance we will be able to successfully implement this plan Certainly if this bold ambitious plan is implemented successfully, it will completely change the face of the Andhra State It is not only a national enterprise It is a mighty task which requires sacrifice as well as great co opera tion not only from the public, but also from the entire army of trained men who will be entrusted with the execution of this plan

Sir, in the preparation of the second five year plan, I am sure, a lot of trouble has been taken But I wish to suggest a few points It is a well known fact that the districts of Rayalaseema are backward economically as well as educationally industrially as well as irrigationally It is unfortunate that in the past these districts have been neglected due to the apathy on the part of the composite Madras State It may be due to other causes also But we are hoping that hereafter at least the present Government in office will certainly take special interest for the economic development of the districts of Rayalaseema That Rayalaseema districts are rich in mineral potentialities like Barytes bauxite, etc is well known During the debate several members have expressed the opinion that

4th August 1955] (Sri B V Subba Reddi)

greater prominence is sought to be given more to major industries and cottage industries than to irrigation I only hope that the Government will take all possible steps to start major industries like Paint and Cement I understand that the cement industry as well as some other industries are likely to be given to the private sector So far as our experience goes, the Birla Factory at Kurnool has not been working very succesfully and it is unfortunate that the private people who have invested money in the shape of shares have been put to considerable loss I only expect the Government to take the initiative in this respect by starting such industries with the Government purchasing 51 per cent of the shares and the public purchasing the balance 49 per cent shares

Sir I have gone through the draft second five-year plan and I do not see anywhere any mention about construction of new railway lines in the Andhra State

The Hon Sri K VENKATA RAO — All India subjects are not mentioned in the draft plan

Sri B V SUBBA REDDI – It is possible that in the first Five Year Plan, the composite Madras State might have thought about this and recommended a few lines It is only a few months back that I had occasion to go through the Press reports wherein I found that that Government recommended three new lines in the Andhra area I wish to mention particularly the line recommended to the Central Government in the districts of Cuddapah and Kurnool The line which is at present sought to be laid goes straight from Nandyal to Cuddapah, i e exactly parallel to the existing road, from Nandyal to Pakala and Mydukur is sought to be made a junction by taking of a branch line to Nellore perhaps with the idea of providing transport facilities to the people of Nellore district to come to the Capital town of Kurnool I think the object in laying the new line is to provide the maximum transport facilities both for passenger traffic as well as for goods to the maximum number of people in the area in which it is sought to be laid It is known that nearly 40 to 50 years back a sum of Rs 30 0 lakhs was collected in these districts as Railway Cess Fund and at that time a line was proposed to be laid from Nandyal to Yerakudipadu connecting important stations like

Koilkuntla, Jammalamadugu, a taluk headquarters with a population of 15 000 and Proddatur which is a municipal town with a population of 40 to 50 000 I would suggest, Sir that if this line is taken just as it has been proposed by the composite Madras Government practically it won t serve the needs of the entire area of Rayachoti taluk which has about 4000 square miles It will only serve a few people along the Nallamalai hills I therefore request the Government to kindly make note of this fact and see that the railway line, instead of running parallel to the existing road on which 16 buses are at present plying, is laid connecting important towns like Koilkuntla Jammalamadugu and Proddatur, the last being made a junction in which case it will practically serve the maximum number of people in this area

I see in the draft plan that under National Extension Schemes a sum of Rs 13 0 crores has been allotted and for Local Development Works a sum of nearly Rs 11 0 crores has been allotted Both these schemes are correlated and practically the work taken under one scheme overlaps the work taken up under the other scheme I would therefore suggest to the Government that both these subjects may be amalgamated and dealt with as one subject It is only just recently that people have taken to realize the importance of the local development works and they are coming in greater numbers and asking for more number of such works to be taken up as speedily as possible. If this is treated as one subject, the villagers will take advantage of that scheme and many amenities could be provided to the rural population Thank you Sir

Sri K V RAMANAYYA NAIDU —అధ్యక్షా, ఇప్పుడు Planning Commission వారు మన ఆంధ్రరాష్ట్రానికి 244 కోట్లు కేటాయించారు ఈ మొత్తము సుమారు అంచనాగా వేయుడిందేకాని చివరకు వారు ఎంత యిస్తారో మనకు తెలియదు. అది వచ్చిన తర్వాత దానిని గురించి ఆలోచించ వలసివుంది ఇప్పుడు ఎక్కువ వేశారు తక్కువ వేశారనే విషయమును మనము చర్చించ నవసరములేదు ఈ Planning Commission ఇప్పుడు చేసిన దానిలో irrigation ఎక్కువగా చేశారు కాని ఈలాటి వసతులు ఏర్పాటు చేయుటములో సాధారణంగా మురుగు కాల్వలకు కూడా వసతి ఏర్పాటు చేస్తేతప్ప ఎక్కువ కాలువలు వృద్ధిచేసి ఎక్కువనీరు సప్లై చేసినందువల్ల ఎక్కువ ప్రయోజనము వుండదు ప్రభుత్వము మురుగు కాలువలకూడా ఏర్పాటు చేసి మురుగు నంతా సకాలములో పొయ్యేటట్లు చేస్తే తప్ప ఎక్కువనీరు సప్లై చేసినా ఉపయోగముండదు

మన ఆంధ్రరాష్ట్రములో అందులో ముఖ్యంగా కృష్ణా డిస్ట్రిక్ట్‌లో యీ మురుగు కాలువ
లను గురించి P W శాఖవారు ఏవిధమైనశ్రద్ధ తీసుకోవడములేదు మురుగు కాలువ
లన్నీకూడా పంద్రుపట్టడమువల్ల అవి ఎక్కువ ఉపయోగ పడడములేదు

(At this stage, the Deputy Speaker occupied the Chair)

వాటినిగురించి ఎక్కువశ్రద్ధ తీసుకోవలసి వుంటుంది రెండవది యీ planning
విషయములో మంత్రి ప్లానుకు సంబంధించినంతవరకూ ఒకటి రెండు ప్రాజెక్టులు బెజవాడ
uplands లో పెట్టారేకాని community projects, N E S Blocks delta
area లో ఎక్కడాపెట్టలేదు అందులో ముఖ్యముగా కృష్ణాడెల్టాలో బందరు కైకలూరు
నుంచి దివి ఐలండువరకు సముద్రము పొరలోవున్న ప్రజలందరికీకూడా తిండిలేక త్రాగ
డానికి నీళ్లవసతిలేక కట్టుకోడానికి గుడ్డలులేక పంటలులేక కొలువులులేక వాండ్లు నాలుగు
నెలలవరకూ కూడా పురవడి కాయలను అడవిలోనుంచి తెచ్చుకొని ఏడుసార్లు వండి నీరు
పారబోసి తర్వాత తినవలసినేకాని లేకపోతే అది విషముక్రింద పరిణమిస్తుంది కాబట్టి
ఆహారాస్తరుగా జీవించుచున్నారు ఇప్పుడు village level లో చేయబడు పనులకు
100 కి 50 రూపాయలు చొప్పున వారు ఇవ్వలేమంటున్నారు 50 రూపాయలు కాదుకదా
5 రూపాయలు కూడా యిచ్చే స్థితిలో లేరు శ్రమదాన మంటున్నారు ముందు
వాండ్లకు ఆకలితీరడానికి తిండవుంటేకదా శ్రమదానము చేయడానికి వీలుంటుంది
అందుచేత కొన్ని ప్రత్యేకమైన పరిస్థితులు వున్నటువంటి area లు కనిపెట్టి
అటువంటిచోట్ల ఇప్పుడు ఏర్పాటు చేయబోయే నీటివసతులకుకాని మంచినీటి
వసతులకుగాని లేకపోతే వాండ్ల యిండ్ల వసతికికాని రోడ్లువేయడానికిగాని
వాండ్ల దగ్గరనుండి ఏవిధమైన contribution డబ్బు రూపేణా కాని, శ్రమ రూపేణా
గాని లేకుండా అంతా గవర్నమెంటు ఖర్చుతోనే చేయవలసిన అవసరము వుంటుంది
మంత్రిగారిని కోరేదేమిటంటే వారు తగు విచారణచేయించి ఎవరైతే 100-కి 50 రూపా
యల చొప్పున యివ్వజాలకుంటారో వాండ్ల దగ్గరనుంచి యీ 50 రూపాయలు
లేకుండా అంతా గవర్నమెంటు ఖర్చు క్రిందే చేయవలసి వుంటుంది ఆవిధంగా విచారణ
చేయవలసి వుంటుందని కోరుతున్నాను రెండవది యీ planning లో మామూలుగా
డిస్ట్రిక్టు బోర్డువారు వేసే రోడ్లు, కల్వర్టు వంతెనలు కూడా యీపంచవర్ష ప్రణాళికలో
పెట్టారు ఈ five Year Plan లో పెట్టడమువల్ల వచ్చే ప్రమాద మేమిటంటే
దీనికి కూడా 100 కి 50 రూపాయలు చొప్పున కావాలంటున్నారు ఈ five Year
Plan లేకపోయినప్పటికి కూడా District Board వారు ప్రారంభించిన
రోడ్లు, యీ వంతెనలు కూడా ఇదివరకు District Board Fund లో నుంచే
యిచ్చేవారు ఈ five Year Plan వచ్చినతరువాత డిస్ట్రిక్టుబోర్డువారికి ఏమిలేకుండా
చేసి Five Year Plan లో పెట్టడముతోటే ప్రజలు భరించలేనపుడు వాండ్లను
100 కి 50 రూపాయలు ఇవ్వవలసిందంటే ఎప్పుడూ అనుకోనటువంటి పరిస్థితులు
కల్పించారు అటువంటివి దీనిలోనుంచి తీసివేసి District Board Fund నుంచి
ఇవన్నీ పూర్తిచేయడానికి ఏర్పాటు చేయాలి ఇదిగ్నికాక ఇంకొక ముఖ్యమైనవిషయము
ఎక్కువ పంట పండించడానికి ఇప్పుడు కృష్ణా barrage కట్టుతున్నారు నందికొండ
ప్రాజెక్టు వస్తే ఇంకా ఎక్కువపంట వృద్ధికానికి వస్తుంది ఇది అంతా వచ్చిన తర్వాత
ఎగుమతి చేయడానికి సరియైన సౌకర్యాలు కనుక లేకపోయినట్లైతే యీ ఎక్కువ
పండించినపంట విలువ అంతగా ఎక్కువ రైతులకు లాభించదు దానికిగాను మా కృష్ణా

District లో బందరునుంచి బెజవాడవరకూ మీటర్ గేజ్ రైలుబండి వున్నది అది చిన్నబండి అక్కడనుంచి సరకును మద్రాసుకుకాని మలబారుకు కాని హైదరాబాద్ కు గాని యితరచోట్లకు కాని తీసుకువెళ్ళాలంటే బెజవాడలో transhipment చేయవలసి వస్తుంది Transhipment చేసేటప్పుడు ఎక్కువ ఖర్చు కావడమో లేకుంటే వర్షాలు వచ్చినప్పుడు తడిసిపోయి నష్టపడి పోవడమో లేకుంటే సరకులు యీ బండిలో నుంచి ఆ బండిలోకి వేసేలోగా అరువలగాని లేకపోతే యితరత్రా కాని చాల సరకు నష్టపడిపోతుంది అందుచేత బందరునుండి బెజవాడ వరకూ వున్నటువంటి రైలును mixed gauge గా చేసినట్లైతే అక్కడపండే పంట ధాన్యాన్ని అంతేకాదా ముఖ్యంగా కృష్ణా జిల్లాలోని పంటను అనేక లక్షల ధాన్యపు బస్తాలను సరాసరి ఎగుమతి చేయడానికి మద్రాసుకు కాని మలబార్ కు కాని ఇటు రాయలసీమకు కాని హైదరాబాదుకు కాని లేకపోతే ఇటువిశాఖ పట్టణమునకు కాని పంపడానికి వీలుగా వుంటుంది కాబట్టి ఆ రైలువేయడమునేది మన స్టేటుకు సంబంధించిన విషయము కాకపోయి నప్పటికీ ఇప్పుడు మన Planning లో చేర్చకపోయినప్పటికీ, మన Planning Minister గారు ఈ నెల ఆఖరుకు ఢిల్లీవెళ్ళబోతున్నారు కాబట్టి వారూ Chief Minister గారు కూడా అక్కడ Planning కమిషన్ వారితో సంప్రదింపులు జరిపి దీనినికూడా include చేసి యీ 5 సంవత్సరాలలో పూర్తి చేయవలసి వున్నదనిచెప్పి వారికి సిఫార్సు చేయవలసిందని నేను కోరుతున్నాను రెండవది మన ఆంధ్రా State లో ఇదివరలో పెద్ద పరిశ్రమలు లేక పోవడానికి కారణము ఆ Planning కమిషన్ లో మన ఆంధ్రులెవరు లేకపోవడముచేత ఆంధ్రరాష్ట్రముయొక్క పరిస్థితులు యీలాగు పరిణమిస్తున్నాయని అనుకోవలసివస్తుంది కాబట్టి మంత్రిగారు అక్కడికి వెళ్ళినపుడు దానిని గురించి శ్రద్ధగా వారికి చెప్పి కావలసిన ఏర్పాటులు చేయవలసివున్నదని కోరుతున్నాను ఇవన్నీ కూడా గమనించి మన మంత్రిగారు ఢిల్లీకి వెళ్ళినప్పుడు మన ఆంధ్రరాష్ట్రముయొక్క విషయములో గట్టిగా వారితోచెప్పి ఇవన్నీ కూడా include అయ్యేటట్లు మనకంతు ముస్తాము తక్కువకుండా వుండేటట్లు ప్రయత్నము చేయవలసివున్నదని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను

Sri D KONDAYYA CHOWDARY — అధ్యక్షా నేను ఒకటి రెండు విషయాలు మాత్రము ప్రస్తావించ దలచుకున్నాను అందులో ముఖ్యంగా ఒకటి Family Planning విషయము, రెండవది sports and games అభివృద్ధివిషయము యీ పంచవర్ష ప్రణాళికలో మంత్రిగారు అన్నివిషయాల కోసము పథకాలు తయారు చేశారుకాని Family planning లో పథకాన్ని తయారు చేసినట్లు కనిపించడములేదు, వారికి అవసరములేదు కాబట్టి దానిజోలికి పోయినట్లులేదు కాని నాబోటివారికి చాలా అవసరముగా వున్నది యీ విషయములో చాల శ్రద్ధతీసుకోవాలని మనవిచేస్తున్నాను ఇక రెండవది, యీ Sports and games విషయము చాల చులకనగా చూడడం పరిపాటి అయింది మన ఆంధ్రదేశములో మొన్న Budget speech లో కూడా నేను గోపాలరెడ్డిగారితో మనవిచేస్తే మనవాండ్లు ఆడినచోట్లంతా వోడిపోతున్నారు, ఎందుకయ్యా వాండ్లకు డబ్బుయిచ్చేది అనికూడా అన్నారు నేను చెప్పేదేమిటంటే ఓడిపోతేగాని గెలవలేము అసెంబ్లీ మెంబర్లు ఓడిపోయి మరలా మంత్రులైనారు అనేసంగతిని మనము జ్ఞాపకము తెచ్చుకోవాలని మాత్రము

4th August 1955] (Sri D Kondayya Chowdary)

నేను మనవిచేస్తున్నాను కాబట్టి ఓడులోనే గెలుపువున్నది ఎప్పుడు కూడా యీ విషయము జాగ్రత్తగా ఆలోచించాలి ఇప్పుడు రష్యావారు చూడండి ప్రథమ పంచవర్ష ప్రణాళికలోనేమి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నైతేనేమి వారు ఆటలకు ఎక్కువ ప్రాధాన్యత యిచ్చివున్నారు దానికోసము ఒక ప్రత్యేకమైన మంత్రివర్గాన్ని ఏర్పాటుచేసి తద్వారా కొన్ని కోట్ల రూబుల్సు ఖర్చుపెట్టి ఫలప్రదమైన అంగ సౌష్టవము వుండేటటువంటి యువకులనూ, యువతులనూ రష్యావారు తయారుచేశారు అందువల్లనే యీనాడు ఆ Planning ప్రకారము నడవబట్టే రష్యాలో వుండే యువకులు, యువతులు కూడా ప్రపంచములో కెల్ల మిన్నయైనటువంటి వారుగా తయారవుతున్నమాట వాస్తవము ఇంగ్లీషులో ఒక సామెత వున్నది, "The battle of Waterloo was won on the Playfields of Eton and Harrow" అని చెప్పి అదేవిధముగ యీ రోజు ప్రపంచములో కెల్ల కూడా అతి సమర్థతతో నిర్వహించి రాజకీయ వేత్తలను ఇంగ్లాండు సృష్టించినదంటే మొన్న జరిగిపోయిన ప్రపంచ సంగ్రామములో విజేతలుగా వారు యితరుల సహాయము లేకుండా ప్రపంచ సంగ్రామాన్ని గెలిచి ప్రపంచములో కెల్లా ప్రశంసనీయులుగా చూరగొన్నారంటే వారు సగర్వముగా చెప్పుకుంటారు మేము నేర్చుకున్న Cricket game కారణమని

ఇదే విధంగా పురాతనకాలంలో కూడా మనదేశంలో ఒక కవి చెప్పాడు చెరిగుడు ఆటలో మన యువకులు రిపులను కదిలించే విధం నేర్చుకున్నారని పురాతనకాలంలో అల్లాంటి సాంప్రదాయాలు గల మనం ఈనాడు వాటికి ఏవిధమైన ప్రోత్సాహం లేకుండా వచ్చే పంచవర్ష ప్రణాళికలో కూడా దీన్ని ప్రోత్సహించుటకు ఏ పథకం వేయకుండా ఉండడం చాలా శోచనీయంగా యున్నదని మనవిచేస్తున్నాను ఈ రోజు స్కూళ్ళకూ, కాలేజీకి పోయే పిల్లకాయలను చూడండి మీరు ఏ పరిశ్రమలు పెట్టినా, ఏ ఉత్పత్తిసాధనాలు తయారుచెయ్యాలని ప్రయత్నం చేసినప్పటికి కూడా దృఢకాయులైన యువకులూ, యువతులూ అనవసరమనే సంగతి మాత్రం మీరు మరిచి పోతున్నారు ఈ Atom Bomb, Hydrogen Bomb రోజులలో కూడా మంచి పుష్టికలిగినటువంటి కుర్రవాళ్ళు ఉంటే గాని ఉపయోగంలేదనే సంగతి వేరే చెప్పనవసరంలేదని మాత్రం మనవిచేస్తున్నాను ఈ ఆటలు పాటలవల్ల దృఢతరమైన శరీరం కలవారిని సృష్టించడానికి అవకాశం ఉంది కాబట్టి ప్రతి school లోనూ ప్రతి కాలేజీలో కూడా playgrounds పెట్టి ఆటలకు ప్రోత్సాహమిచ్చే పథకాలను ప్రభుత్వం చెయ్యాలనీ కోరుతున్నాను యీ plan మొదటి పేజీనుంచి కొసపేజీదాకా ఈ plan లో చూచినా కూడా దానివిషయం complete గా మరిచిపోయారు కాబట్టి, ఇప్పుడైనా వచ్చే పంచవర్ష ప్రణాళికలో నైనా, దీనికి అవసరమైనటువంటి ధనాన్ని కేటాయిస్తారని ఆశిస్తున్నాను పురాతన కాలంలో మనదేశంలో కూడా సాక్షాత్తు శ్రీకృష్ణ పరమాత్మకు కూడా తన కార్యాన్ని నిర్వర్తించడానికి ఒక అర్జునుడు అవసరమైనాడన్న సంగతి మరిచిపోకూడదు సరైనటువంటి దేహంలో సరియైనటువంటి మేధస్సు ఉంటేనే ఉపయోగపడుతుంది గాని మేధస్సు ఎంత గొప్పదైనప్పటికీ కూడా శరీరం సరియైనది కాకపోయినప్పుడు ఉపయోగపడ నేరదు అది మాత్రం మనస్సులో పెట్టుకోవాలి నేను ఎక్కువసేపు దీన్ని గురించి మాట్లాడి మిమ్మల్ని విసిగింపదలచుకోలేదు మన colleges లో schools లో ప్రతి వాటికీ playgrounds లేవు కొన్నిచోట్ల ప్రదేశాలు acquire చేసి వినా సరే

ప్రతి school కీ, ప్రతి కాలేజీకి ఒక playground ఉండేటట్లు, వాళ్ళ ఆటపాటలకు ఎక్కువ ప్రోత్సాహం కలిగేటట్లు ధనాన్ని కేటాయించవలసిందని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను పురాతనకాలంలో చాణక్యుడు విదేశీయులను తరుముటకు చంద్రగుప్తుని తయారుచేశాడు అటులనే ఈ వర్తమాన చాణక్యుడు కూడా మన ఆంధ్రదేశంలో, వచ్చే 5 సంవత్సరాలలో అనేక వేలమంది చంద్రగుప్తులను తయారుచేసి మన దారిద్ర్యాన్ని పారద్రోలుటకు వారిని సాధనంగా ఉపయోగిస్తారని నమ్ముతూ విరమిస్తున్నాను

Sri R NATHAMUNI REDDI — ఉపాధ్యక్షా! ఇదివరకు Medical demand వచ్చినప్పుడు నేను ముఖ్యంగా తిరుపతిలో Medical College పెట్టాలనీ, దేవస్థానంవారు దానికిగాను సగం డబ్బు ఇస్తామన్నట్లు చెప్పియుండిరి అందువల్ల ఇప్పుడు Medical కాలేజీలు పెట్టాలని ఈ రెండో పంచవర్షప్రణాళికలో పేర్కొన్నారు ఎచటపెట్టుటఅనిమాత్రం వారు తెలుపలేదు ఇప్పుడు వారికి కావలసినటువంటి అర్ధడబ్బు ఇస్తామని చెప్పినప్పటికీకూడా ఈ ప్రస్తావన చేయుటకు చింతించుచున్నాను దీన్ని గురించి చెయగలరని కోరుతున్నాను మా రాయలసీమజిల్లాలూ, మా చిత్తూరుజిల్లాకూడా industrially చాలా వెనుకబడియున్నవి తిరుపతిలో Sri Venkateswara Weaving Mill అని దానికి 5 లక్షలరూపాయలవరకూ ఖర్చులుచేసి ఆ పని పూర్తి కాకుండా ఆపుజేశారు దానివిషయంలోకూడా ఈ రెండో పంచవర్షప్రణాళికలో ఏమీ చెప్పబడియుండలేదు ఎవరైనా private individuals ఈ పని పూర్తి చేయుటకు ముందుకువచ్చినప్పుడు ప్రభుత్వంవారు తగు సహాయంచేయవలసినదిగా కోరుచున్నాను మా జిల్లాలో irrigation projects చిన్నవైనా, పెద్దవైనా ఏమీ లేవు Medium projects కు చాలావరకు ప్రాముఖ్యత ఇచ్చి అనేక projects తీసుకుంటారని కోరుచున్నాను తిరుపతిలో University యుంటూయున్నది అచట Polytechnic school పెట్టించాలని మంత్రిగారు అక్కడ పర్యటనచేసినసందర్భములో అందరూ చెప్పారు వారుకూడా చెప్పినట్లే కరువంగాఉంది ఇప్పుడు నెల్లూరులోనో, గుంతకల్లులోనో విశాఖపట్టణంలోనో ఎక్కడో పెట్టేటట్లు ఉన్నది ఇంకను నాలుగవదికూడా అవసరమున్నది కాబట్టి తిరుపతిలో తప్పక Polytechnic School పెడతారని కోరుతున్నాను

Sri M KOTI REDDI —అధ్యక్ష మహాశయా! కోట్లకొలదీ రూపాయిలు ఖర్చుపెట్టి నీరు లేని ప్రాంతాలకు నీటివసతులు కల్గచేస్తున్నారు కాని మా కృష్ణానది ఒడ్డున ఉన్నటువంటి భూములలో ప్రతి సంవత్సరం నాలుగయిదుసార్లు వరదలు వచ్చి పంటలన్నీ కొట్టుకు పోతున్నాయి వాటి రక్షణకోసం కట్టవేయవలసిందని ఇదివరకు అనేకసార్లు మహాజర్లు పంపించాను దాన్ని గురించి ప్రభుత్వమువారు ఏ విధమైన చర్య తీసుకోలేదు ఇదివరకు భూములు కొయ్యకుండా నది ఒడ్డున రెల్లు పెంచుతూ ఉండేవారు ఇప్పుడు ఆ రెల్లుగడ్డి పెంచడం కూడా మానేశారు అందువల్ల భూములన్నీ కోతపడి రెండు మూడు సంవత్సరాలలోపల సుమారు 500 ఎకరాలు నది గర్భంలో కలసిపోయింది అవి చాలా విలువ గలిగినటువంటి భూములు ఎకరం రెండువేలు మూడువేలు కిమ్మత్తు చేసేటటువంటి భూములు వెంకటపాలెం, పెనుమాక మొదలైనటువంటి గ్రామాదులలో రెండు, మూడు సంవత్సరాల లోపల 4, 5 వందల ఎకరాలు ఆ నదీ గర్భంలో కలిసిపోయింది రాను రాను అది వెంకటపాలెం గ్రామానికి చాలా దగ్గరగాకి కూడా

వస్తోంది గ్రామంలోంచి ప్రజలు లేచి పోవలసి వస్తుందని ఈ మధ్య revenue అధికార్లకూ, P W D వారికీ అర్జీలు పెడుతూ కనీసం కట్టనైనా పెంచవలసిందని అనేక petition లు పెట్టారు కాని దాన్ని గురించి ప్రభుత్వము వారు ఏవిధమైన చర్య తీసుకోలేదు ఈ సంవత్సరం మాత్రం 6 వేల రూపాయలు కట్ట నాటడానికి sanction చేశారు కాని 6 వేల రూపాయలతో అక్కడ ఏమీ పని సాగదు సుమారు 10, 15 మైళ్ళ దూరం ఈ నదివల్ల కోతపడుతోంది ఈ 10, 15 మైళ్ళ దూరం కట్ట నాటి పెంచడానికి 6 వేల రూపాయలు చాలవు బాజులు వగైరాలు పాతి కంప అడ్డం వేసి పైన కట్టనాటితేనే తప్ప అది బ్రతకదు ఈ 6 వేల రూపాయలకు కావలసిన సామానుకూడా రాదు దాన్ని ప్రభుత్వం వారు విచారించి శీతానగరం లగాయతు అమరావతి వరకూ కట్టవేయవలసిందని చెప్పి ఎప్పుడో 15, 20 సంవత్సరాల క్రిందట ఒకసారి సర్వేచేశారు ఆ కట్టవేయడం కోసం estimates వగైరాలు తయారుచేశారు దానికి అక్కడక్కడ రాళ్ళువగైరాలుకూడా పాతియున్నారు ఇప్పటికీ కనిపిస్తున్నాయి ఎందువల్లనో అప్పుడు మానేశారు ఇప్పుడైనా ఆ కట్ట వేయిస్తేతప్ప కొన్ని లక్షల ఎకరాలలో ప్రతి సంవత్సరం ఏడాదికి మూడు నాలుగ పర్యాయాలు కూడా వరదలు వచ్చినప్పుడు పంటలన్నీ పాడయిపోతున్నాయి ఆవిషయమై గట్టిచర్యలు తీసుకోవలసిందని మనవి చేస్తున్నాను మంగళగిరి లగాయతు అమరావతి వరకూ ఏ విధమైన దారి మార్గాలులేవు రాయపూడి, మందడ, దొండపాడు మొదలైనటువంటి గ్రామాలలో communist లు దాడులు సాగించి దోపిడీలు, హత్యలు చేస్తూంటే రాత్రి 9 గంటలకు వచ్చి ఒంటి గంట వరకూ వాళ్ళు వీరవిహారం చేసినప్పటికీ ఆ వార్త police station కు అందలేదు దానికి రోడ్డు లేనందువల్ల అవకాశం కూడా లేకుండా పోయింది దాని తరువాత ఒక సంవత్సరం మాత్రం temporary permission ఇచ్చారు, బస్సులు వగైరాలు నడుపుకోడానికి, అక్కడ ఈ హడావిళ్ళు మూలాన రాత్రిపూట పోలీసువారు రావడానికీ పోవడానికీ అవకాశం ఉంటుందని మళ్ళీ దాన్ని కూడా తీసేశారు ఆ రోడ్డు అక్కడ నిర్మించ వలసిందని కోరుతున్నాను తరువాత ఆ గ్రామాలలో రైతులంతా ఈ మధ్య ఒక సభచేసి ఈ కట్ట వేయడానికి నాలుగవ వంతు వసూలు చేసి ఇస్తామని Revenue Divisional Officer గారికి తెలియజేశారు ఆ రకంగా ప్రజలదగ్గర నుంచి కొంత డబ్బు వసూలు చేయడానికి అవకాశం ఉంది కాబట్టి దాన్ని త్వరలో పూర్తి చేయిస్తారని చెప్పి నమ్ముతూ ఇంతటితో విరమిస్తున్నాను

Sri N RAMULU — ఉపాధ్యక్షా ! ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో గ్రామసీమల సౌభాగ్యానికే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చినట్లు గుర్తింపబడినది ఈ ప్రణాళిక యొక్క కార్యక్రమము బహుముఖముగా ఉన్నది ఈ ప్రణాళికను సాకల్యంగా పరిశీలించి, దానికి సమగ్రమైన స్వరూపాన్ని ఇచ్చి, అందుకు కావలసిన ఆర్థిక సహాయము కేంద్రమునుంచి సంపాదించుటకు తగిన శక్తి సామర్థ్యములు గల మంత్రివర్యులు ఈ శాఖకు అధ్యక్ష్యము వహించడము ఆంధ్ర ప్రజానీకం యొక్క అదృష్టమని చెప్పక తప్పదు ఈ నాడు 264 కోట్లు రూపాయల కార్యక్రమం ఈ ప్రణాళికలో చూపించబడింది అందులో ముఖ్యంగా వ్యవసాయ పరిశ్రమకు అధిక భాగము కేటాయించబడి ఉండుట అభివృద్ధిదాయకమే అయినప్పటికీ ఈ ప్రణాళికను జయప్రదం

గావించవలెనంటే, ప్రజలయొక్క సహకారాన్ని కూడ సమీకరించుకోవలసిన బాధ్యత ప్రభుత్వంమీదనే గాక, శాసన సభ్యులమీద కూడ ఉన్నదని మంత్రివర్యులు చెప్పిన మాట వాస్తవమే కాని ఈ ప్రణాళికను తయారుచేయడంలో గ్రామ ప్రజలు సహకరించడానికి అవకాశం లేకుండా ప్రభుత్వముయొక్క సిబ్బందివల్ల మాత్రమే తయారు చేయబడినది ప్రజాసహకారము సమీకరించుకోవాలంటే అసలు ఈ ప్రణాళిక ఏమిటో అర్థంచేసుకోగల పరిస్థితిలో ప్రజానీకానికి ప్రచారం గావించవలెను అందువేత, ప్రభుత్వం వారు ఇప్పుడు publicity గురించి చూపెట్టిన 25 లక్షలు చాలదని మనవిచేస్తున్నాను ఈ ప్రచారం ఎక్కువగా సాగించిననాడే ప్రజానీకం దీనిని అర్థంచేసుకొని ఈ కార్యక్రమము మనగురించే పెట్టబడినదని గుర్తించి, ముందుకు వచ్చి వారు చేయవలసిన సహాయ సహకారాలు చేయగలరని నేను ఆశిస్తున్నాను

ఇక irrigation గురించి చెప్పవలసివస్తే, ముఖ్యంగా గతనూరేళ్ళనుంచి వంశధార ప్రాజెక్టుగురించి ఎదేదో మొరలుపెట్టుకొని ఇప్పటివరకు సాధించలేని ఈ ప్రాజెక్టును ఈ ప్రణాళికలో చేర్చినందుకు వారికి మా జిల్లాతరఫున ధన్యవాదాలు అర్పిస్తున్నాను మా శ్రీకాకుళంజిల్లాలో నూరుమైళ్ళు కోస్తాప్రాంతమున్నది ఈ కోస్తా ప్రాంతములో ఎక్కువమంది చేపలపరిశ్రమలమీద బ్రతుకుతూవుంటారు ముఖ్యముగా ఈ చేపల పరిశ్రమలో ఎటువంటి సహాయ సహకారాలు ప్రభుత్వంనుంచి లేనందువలన, వారు బర్మాకుపోయికూడ బ్రతికేవారు బర్మాకుపోయినతరువాత బర్మా కాందిశీకులయి ఆకోస్తా ప్రాంతాలలో ఎటువంటి ఉద్యోగాలులేక కష్టపడుతున్నారు వారికి తగిన పనిచూపించాలంటే ఇప్పుడు ఈ ప్రణాళికలో చూపించిన 80 లక్షలు చాలదు ఈ fisheries improve చేయాలంటే, వారికి కావలసిన technical knowledge ని అందజేయడానికి తగిన పరికరాలు supply చేసి పట్టిన చేపలను రవాణాచేయడానికి కావలసిన సదుపాయాలుకూడ చేయవలసిన అవసరమెంతైనా ఉన్నది కనుక ఈ ప్రణాళికలో ఇందుగురించి చూపిన 80 లక్షలు కాకుండా, కనీసం రెండుకోట్లకైనా దీనిని పెంచవలెనని కోరుచున్నాను

తరువాత మరొక ముఖ్యమైనవిషయం చెప్పవలసియున్నది ఈ ప్రాంతాలలో జీడిపిక్కలు విస్తారంగా పండుతూఉంటాయి వాటియొక్క పప్పును విదేశాలకు ఎగుమతి చేయవచ్చును ఈ పిక్కలపరిశ్రమను అభివృద్ధిచేయడానికి Industries లో చూపించిన మొత్తం చాలదు కనుక ఈ పరిశ్రమలకు ఎక్కువమొత్తము కేటాయించి ఈ జీడిపిక్కల పరిశ్రమను ఒక క్రమపద్ధతిలో నడుపవలసిన అవసరమున్నదని ప్రభుత్వము గుర్తించాలని కోరుతున్నాను

ఇక సౌకర్యాలవిషయములో పల్లెప్రాంతాలలో వైద్యసౌకర్యాలులేవు సరికదా, వారు వైద్యసౌకర్యాలు పొందడానికి పట్టణాలకు పోవాలంటేకూడ తగిన రహదారి సౌకర్యాలు లేకుండాఉన్నది కనుక 16 వేల గ్రామాలు కలిగిఉన్నటువంటి మన రాష్ట్రములో ఈ పల్లెలకు తగిన రహదారి సౌకర్యాలను వెంటనే కలిగించవలెనని కోరుచున్నాను

ఇక సామాన్యప్రజానీకానికి సంబంధించినంతవరకు ఈ గృహసమస్య అనేది చాలా క్లిష్టతరంగా ఉన్నది ఈ గృహసమస్యను మనము పరిష్కరించుకోకపోతే ఈ అనారోగ్యంవల్ల బాధపడే ప్రజానీకానికి వైద్యసౌకర్యాలను ఎక్కువగా మనము సమ

కూర్చవలసియుంటుంది కనుక ఈ గృహనిర్మాణ కార్యక్రమము co operative basis మీద తీసుకొని ఒక పదికోట్లరూపాయలు ఇందుకు కేటాయించి, ఒక్కొక్క కుటుంబానికి ఒక వెయ్యిరూపాయలచొప్పున 20 సంవత్సరాల వాయిదాలతో చెల్లించుకొనేటట్లు, అప్పులుయిచ్చి ఆవిధంగా ఈ గృహసమస్యను పరిష్కరించుకోవచ్చు ఈ వెయ్యిరూపాయలు అప్పుగాయిచ్చేముందు దాంట్లో పదవవంతు share capital గా demand చేసినా సామాన్యప్రజానీకం ఇవ్వగలరు ఆవిధంగా ఒక కోటిరూపాయలు మనము share capital గా సంపాదించవచ్చును అందువలననే ఈ గృహసమస్యను సత్వరంగా అన్నిటికంటె ముందు పరిష్కరించవలసిన అవశ్యకత ఉన్నదని ప్రభుత్వం వారు గుర్తించాలని కోరుతూ ఈ అవకాశమిచ్చినందుకు ఉపాధ్యక్షులవారికి నావందనములర్పించుకొంటున్నాను

Sri C SUBBARAYUDU — ఉపాధ్యక్షా, ఏ దేశములోనైనా ఆర్థికాభివృద్ధి సాధించాలంటె, అక్కడ ఉండేటటువంటి సాంఘికపరిస్థితిని బట్టి అక్కడ ప్రజానీకం గ్రామాలలో ఎక్కువ నివసిస్తున్నారా లేక పట్టణాలలో ఎక్కువ నివసిస్తున్నారా, వారు వ్యవసాయంమీద ఎక్కువగా ఆధారపడినారా, మరి దేనిపైన ఎక్కువగా ఆధారపడినారనే ఈ ప్రాతిపదికలపైననే planning చేసుకోవలసియుంటుంది కనుక మన ఆంధ్రదేశముయొక్క పరిస్థితులు గమనించినప్పుడు ఎక్కువమంది గ్రామీణ ప్రాంతాలలోనే నివసిస్తున్నారనిన్నీ నూటికి 70 గురు వ్యవసాయం మీదనే ఆధారపడి ఉంటారనిన్నీ అంతేకాక 10 percent ప్రజానీకం ఇతర వృత్తులలో నిమగ్నులైనటువంటివారు గ్రామ ప్రాంతాలలో నివసిస్తున్నారనిన్నీ మనకందరికిని తెలుసును అటువంటప్పుడు వారి ఆర్థికాభివృద్ధిని, జీవితప్రమాణాన్ని పెంచాలంటె ఈ వ్యవసాయానికి తోడుగా గ్రామాలలో ఉంటున్నవాళ్ళకి ఉపవృత్తి కల్పించడం తప్ప మరొక మార్గం లేదు నూటికి 70 వంతులు, 80 వంతులు గ్రామీణ ప్రజలుగా ఉండేటప్పుడు ఈ రెండవ పంచవర్షప్రణాళిక పూర్తిఅయ్యేటప్పటికి, వారు కనీసం రోజుకు ఒక అణాగాని అర్థణా గాని ఎక్కువగా సంపాదించగలిగితే, ఇది ఒక మహత్తరమైన ఘనకార్యంగా ఎంచుకోవచ్చును లేకపోతే వారిని ఆర్థికంగా అభివృద్ధిపరచడానికి అవకాశంలేదు అంతేగాకుండా నిరుద్యోగాన్ని తొలగించడానికి అవకాశముండదు మన రాష్ట్రములో ఎంతమంది వృత్తిలేకుండా ఉన్నారని గ్రహించినపుడు అటువంటివారికి వృత్తి కల్పించడానికి తగిన పరిశ్రమలు కల్పించవలసియుంటుంది కాని నిరుద్యోగానికి తోడ్పడేటటువంటి machineries ను గాని, factories ను గాని, అటువంటి పరిశ్రమలనుగాని ప్రోత్సహించకుండా ప్రభుత్వము నిర్ణయించుకొన్నప్పుడే, మనం దీనిని సాధించగలుగుతాము ప్రతిగ్రామాన్ని వీలైనంతవరకు స్వయంపోషకం చేయాలనేదే గాంధిగారియొక్క లక్ష్యము ఆవిధంగా చేసినపుడే ఒకరు ఇంకొకరిని దోపిడి చేయడానికి వీలుండదు కనుక పూర్వంనుంచి మన దేశములో సంఘ నిర్మాణం ఏవిధంగా జరుగుతున్నదో అటువంటి ప్రాతిపదికల పైననే ఈ Plan కూడ వేసి దానిని సాధించినట్లయితే, అపుడు ప్రతి ఒక్కరు సుఖపడడానికి అవకాశం ఉంటుంది ఆ దృష్ట్యా ఆలోచించినపుడు, ఒక్క రాష్ట్ర ప్రభుత్వమే ఈ Plan ను సాధించడానికి వీలులేదు Central Government దీన్ని గురించి తీవ్రంగా ఆలోచించి నిర్ణయించుకొంటే తప్ప రాష్ట్ర ప్రభుత్వ మొక్కటే ఏమిచేయడానికి అవకాశం లేదు మనము కుటీర పరిశ్రమలను ఏవేవో ప్రోత్సహించాలని అంటూ ఉంటాము కాని, ఈవిధంగా ఎన్ని ఉపన్యాసాలు

వారు ఎన్ని ఖర్చు చేసుకుంటే అన్ని చేసుకోనివ్వండి మీరు ఇల్లా చేయడంలేదు వీరు 50 రూపాయిలిస్తేనే మేము 50 రూపాయిలిస్తాము అని పేచీపెట్టడంతో కష్టంవస్తుంది ఇచ్చే ప్రదేశాలలో యీరు తక్కువ ఇవ్వండి ఇవ్వలేని దేశాల్లో ఎక్కువయివ్వండి

The Hon Sri K VENKATA RAO — ఇంతవఱకూ జరిగినదంతా backward areas లో వున్న blocks లోనే జరిగింది ఉన్న blocks చాలా అక్కడనే ఉన్నాయి

Sri P SUNDARAYYA — తరువాత Scheduled castes కి సంబంధించిన 56 పేజీలో ప్రభుత్వం చెప్పింది మేము ఇంతకాలం ఇన్ని పనులు చేసినా these measures have not materially improved the living conditions of the rural Harijan population అని ఒప్పుకున్నందుకు సంతోషం ఎందుకు బాగుపడలేదనే సంగతి ఆలోచించండి ఎందుకంటే ప్రధానంగా కావలసిన వృత్తి మీరు చూపించనంతకాలం అదిచేస్తున్నాం, ఇదిచేస్తున్నాం అని ఎన్ని చెప్పినా వాళ్ళస్థితి బాగుపడదు ఇప్పుడైనా ఈ సంగతి గుర్తించండి అదేరకంగా scheduled areas లో మేము అక్కడ ఎన్నో schools పెట్టాం అన్నారు Most of the schools in the scheduled areas are either bogus or are not working satisfactorily Bogus అనే పదం మీరు ప్రయోగించిందే ఐతే వాటిని బాగుచేయడానికి 5 కోట్ల రూపాయలు scheduled areas లో ఖర్చుపెడతామంటున్నారు అందులో వరదలువచ్చి పోడు వ్యవసాయంలో భూమి కొట్టుకుపోతుంది కాబట్టి దాన్ని బాగుచేయడానికి 80 లక్షల రూపాయిలు రోడ్లు వేయడానికి ఇంకో 80 లక్షల రూపాయిలు ఇంకా administration కు కొన్ని లక్షలు ఇల్లాగే 2 కోట్ల రూపాయిలు 5 కోట్లనుంచి పోతుంది నిజంగా ఆ scheduled tribes కు ఉపయోగపడేది మూడుకోట్ల రూపాయిలకన్న ఎక్కువలేదు ఈ 3 కోట్లరూపాయిలలో Education కు 80 లక్షలూ తరువాత అనేకపద్దులున్నాయి అందులో ఒకపద్దు 750 కుటుంబాలను land colonization schemes క్రింద ఒక చోట చేర్చి వారికి కొన్ని సౌకర్యాలు కల్గచేసేందుకు పెడుతున్నాం దానికి 30 లక్షలు ఖర్చవుతుంది ఈ scheduled areas లో లక్ష tribal కుటుంబాలున్నాయి ఈవిధంగా వాళ్ళు చెల్లాచెదురుగా అక్కడ ఒకకుటుంబం, ఇక్కడొక కుటుంబం ఉన్నట్లయితే బాగుచెయ్యడం ఎవరితరమూకాదు అందుచేత 100 కుటుంబాలను ఒక చోటికి తీసుకువచ్చి వారికి సౌకర్యం కల్గజేయుటకు ప్రభుత్వం పూనుకోవడం మంచిదే ఈరీతిగా ఐతే 40 కోట్లరూపాయిలు కావాలి 5 ఏళ్ళకు ఒక కోటిచొప్పున పెట్టినా 200 సంవత్సరాలవఱకూ వారి స్థితి ఇల్లా ఉండవలసినదేనా? అందువల్ల ఈ విషయం పునరాలోచించవలసియుంటుంది వారికి పనిచూపిస్తే తప్ప ఇంకోరీతిగా ఈ సమస్య పరిష్కరించలేం

ఇక సహకారశాఖనుగురించి ఆలోచించినప్పుడు నూటికి 43 మంది గ్రామసీమలలోనున్న ప్రజానీకానికి ఈ సొసైటీలు అందుబాటులో తీసుకువస్తాము అని అన్నారు సంతోషమే కాని దీనికి అందుబాటులోలేని మిగతా 57 percent మంది దురదృష్టవంతులెవరు అన్నట్లయితే భూమిలేని వ్యవసాయకూలీలు భూమి తక్కువగా

4th August 1955]        (Sri P Sundarayya)

ఉన్నటువంటి పెద్ద ప్రణాళికను దీనిక్రింద వస్తుందని చెప్పవలసివున్నది ఎందుకనగా Labour Contract societies ఈరోజున ఎన్ని ఉన్నాయో, అయిదేళ్ళ తరువాత అన్నే ఉన్నాయి Field Labour Co operative societies ఈ రోజున ఎన్ని ఉన్నాయో, అయిదేళ్ళ తరువాత అన్నే ఉన్నాయి ఇప్పటికైనా వాటికి ప్రోత్సాహమిచ్చి భూములిచ్చి పనులు ఇస్తే అవి పనిచేస్తాయి కాని వున్న భూమినే ఊడబెరుకుతున్నపుడు ఈ సొసైటీలు పెట్టుకుంటేమటుకు ఏమి ప్రయోజనము? అందుచేత ఈ Field Co-operative Societies కు ఇంకా ఎక్కువగా తోడ్పడి వాళ్ళకు భూములిచ్చి అనేక contract పనులు ఇచ్చి ఆరీతిగా ప్రభుత్వము సహాయము చేయనంతకాలము ఈ సహకారోద్యమము పూర్తిగా సహాయపడదు ఈ సొసైటీలు కూడాను ఎక్కువగా బీదప్రజానీకానికి, మధ్యప్రజానీకానికి అప్పులయిచ్చి, వారికి ఇతర సౌకర్యాలు ఇచ్చేందుకు పూనుకోవాలి కాని ఈరోజున ఆ పరిస్థితి లేదనే సంగతి ప్రభుత్వానికికూడ తెలుసు ఇప్పుడు రైతాంగానికి 93 కోట్లరూపాయల అప్పులు కావలసియున్నది 1960 నాటికి దాంట్లో 5వ వంతు చేస్తామని 1970 నాటికి సగం చేస్తామని అంటున్నారు అయితే నూటికి నూరుపాళ్ళు ఎప్పుడుచేస్తారు? ఈవిధంగా అయితే 50 ఏళ్ళకుకూడ మారదనుకొన్న Societies pattern కొడన్నమాట ఇదేమి ప్రణాళికో నాకేమి అర్థంకావడంలేదు

ఇక irrigation విద్యుచ్ఛక్తి గురించి వీటికేమీ ఎక్కువ డబ్బు ఇవ్వమని కోరడి లేదు అయితే తుంగభద్ర High Level Channel కు ఎంత డబ్బు కేటాయించింది దానికి వివరాలు ఇవ్వలేదు దాన్ని అయిదేళ్ళ లోపలనే పూర్తి చేయడానికి ఎంతడబ్బు కావలసి యుంటుందో అంతడబ్బు sanction చేయించుకొని దానికి కేటాయించాల లవ్వని చెప్పమన్నాను తరువాత సందికొండకు ఏదో మూడు ఫేజులు నాలుగు ఫేజులని చెప్పి 20 ఏళ్ళు కాకుండా దానిని సాధ్యమైనంత త్వరగా, పది ఏళ్ళ లోపైనా, పూర్తి చేయడానికి పూనుకుంటేగాని కుడి కాలవలో నాలుగువేల క్యూసెక్కులు సోమశిల దగ్గర పడుతుంది ఆ నాలుగువేల క్యూసెక్కులలోనే నెల్లూరు దక్షిణప్రాంతము కూడ సాగు చేయడానికి వీలవుతుందని ఖోస్లా కమిటీ చెప్పారు అదేమాట ఈరోజు ఇంజనీర్లు కూడ చెప్పుతున్నారు అందుచేత తక్కువ ఖర్చుతో పూర్తిగా ఆంధ్ర రాష్ట్రములో అన్ని ప్రాంతాలకు నీరు సప్లై చేసుకోడానికి తుంగభద్ర ఎగువకాలువ లోను అవతల మనం ఆరంభించిన medium projects ద్వారా వంశధారలోను సాధ్యమవుతుంది తరువాత చిన్న చిన్న ముంపునివారణ స్కీములు అవసరమైనచోట్ల చేసినట్లైతే అందరికి కొంత సంతృప్తి ఉంటుంది దాని తరువాత గోదావరిపైన బ్రహ్మాండమైన ప్రాజెక్టు సాధించవచ్చు బహుశా సిద్ధేశ్వరం, సోమశిలలో ఇంకా బ్రహ్మాండమైన project సాధించుకోవచ్చు అందుచేత ఉన్నచోటనే రెండవపంటకు నీరు supply చేసి దానికంటె వీలైనంతవరకు ఎక్కువమందికి నీరు supply చేయుటకు పూనుకోవడంతో మనం ముందుకు పోగలము

తరువాత పరిశ్రమల విషయంలో మన రాష్ట్రములో కొన్ని పెద్ద పరిశ్రమలు పెట్టుటకు కేంద్ర ప్రభుత్వమును వొత్తిడిచేసి సాధించవలసిన అవసరమున్నది ఎరువుల Factory Steel Fabricating Factory Heavy Electric Machinery ఈ పరిశ్రమలను ఒక 50 కోట్లకు తక్కువ లేకుండా మన రాష్ట్రములో పెట్టేట్లు

చూడాలి కోటి నలభై లక్షల జనాభా ఉన్నటువంటి ఒరిస్సాలో నూరుకోట్లుపెట్టి ఒక Steel Factory పెడుతున్నారు అదే విధంగా మధ్యప్రదేశ్ లో కూడా నూరు కోట్లతో ఒక Steel Factory పెట్టుకొన్నారు Bengal లోనూ, Bihar ఇదివరకే చాలా ఖర్చు పెట్టారు కనుక పారిశ్రామికంగా చూచినప్పుడు మన రాష్ట్రానికి కేంద్ర ప్రభుత్వము ఖర్చు పెట్టవలసిన బాధ్యత ఉన్నది పారిశ్రామికంగా వెనుకబడిన ఆంధ్రరాష్ట్రములో ప్రజలే చేస్తారంటే అది సాధ్యంకాదు కాబట్టి కేంద్ర ప్రభుత్వం నిర్మించుకొనే టటువంటి ఈ పెద్ద factories ను వెనుకబడి నటువంటి ఆంధ్రరాష్ట్రానికి ఇవ్వాలని కోరవలసి యున్నది Tamilnad ఇదివరకే ఎక్కువ అభివృద్ధి చెందినది ఇంకా అభివృద్ధి చెందినా మనకు అభ్యంతరం లేదు అక్కడ 70 కోట్లదాకా ఖర్చుపెట్టి multi purpose project క్రింద ఒకటి develop చేయాలని కేంద్ర ప్రభుత్వము అనుకుంటున్నది అటువంటప్పుడు మనము ఈ రెండు చిన్న పరిశ్రమలను అనగా ఎరువులపరిశ్రమ ఒకటి Fabricating Factory ఒకటి ఒక భారీ విద్యుచ్ఛక్తియంత్రాగారాన్ని కోరడం చాలా న్యాయమైన కోరిక అది కూడ ఇవ్వకపోతే ఆంధ్రరాష్ట్రంపైన ఒక ప్రత్యేక కన్ను వేసుకొని కావాలని ఈ విధంగా తగ్గిస్తున్నారని చెప్పడానికి మనకు హక్కు వున్నది దానికి మంత్రిగారు మనకంటె గట్టిగా దెబ్బలాడుతారనుకుంటాను ఈ రోజు ప్రభుత్వమే అన్ని పరిశ్రమలను తీసుకొని నడపాలనే ఉద్దేశము కాదు అది సాధ్యంకాదు కూడా కాని పరిశ్రమలకు కొంతమంది ఆస్తులు ఉన్నవాళ్ళే వ్యక్తిగలవాళ్ళే వ్యక్తిగతంగా తీసుకొని లాభాలు తీసుకోకూడదు అనేదే మా సిద్ధాంతము గాని వచ్చినంతవరకు వాళ్ళను ప్రోత్సహించడానికి మా కేమి అభ్యంతరం లేదు అయితే ఒక సంగతి మాత్రము ఈ సందర్భములో జ్ఞాపకం ఉంచుకోవలసి యున్నది వాళ్ళు తయారు చేసేటటువంటి వస్తువులు మంచి quality గలిగి ఉపయోగకరంగా ఉండేటట్లు చూడండి Quality of goods జాగ్రత్తగా కాపాడండి తరువాత గాని యేమైన ధరలు అందేటట్లు చూడండి కార్మికులకు న్యాయమైన వేతనాలు ఇచ్చేటట్లు చూడండి విపరీతమైన లాభాలు తీసుకుంటే, న్యాయమైనవరకే తీసుకొనేటట్లు చూడండి అదివరకే Industrial Act క్రింద మీకు అధికారము ఉన్నది దాన్ని అమలుజరపడానికి పూనుకొంటే ఇవన్నీ జరుగుతూంటవి

తరువాత ఈ పశుసంపద గురించి, వ్యవసాయం గురించి చూడవలసిందే కాని మీరు అవి కొంటాము, ఇవి కొంటాము, కోళ్ళు, బాతులు, మేకలు ఇవన్నీ కొంటామని అంటున్నారు మేకలనుమాత్రం పెంచుతామంటున్నారుగాని, మేయడానికి వదలడంలేదు, అలాంటప్పుడు వీటినిఎట్లా పెంచుతారో నాకు అర్థంకాదు పెంచండి నాకేమి అభ్యంతరములేదు కాని ప్రతివిషయంలో గూడా ప్రధానంగా బీదప్రజానీకానికే ఉపయోగపడేటట్లు చూడండి ఉన్నవారికే పెట్టేటట్లు చేయకండి పాలు సప్లయికోసం రెండు కోట్లు ఖర్చుపెడుతున్నారు కాని ఆపాలు ముందు బిడ్డలకు జబ్బుగాఉండి కొనలేనటువంటివారికోసమై వినియోగించితే ఆ రెండుకోట్ల రూపాయలు సద్వినియోగం చేసినట్లు అవుతుంది అదికాకుండా ఉన్నవాళ్లకే ఇస్తేమాత్రం, అది దుర్వినియోగమవుతుందని చెప్పక తప్పదు

తరువాత వీటన్నిటికి డబ్బు ఎక్కడనుంచివస్తుందని మంత్రిగారు అడగవచ్చును ఈ విషయంగురించి మంత్రివర్గమే ప్రణాళికలో 7 వ పేజీలో చెప్పిఉన్నారు Central

Government వారు వాళ్ళ ఆదాయంలో ప్రతిసంవత్సరం ఇంత ఖచ్చితంగా ఇస్తామని చెప్పారు కనక వారు ఆ భాగము కేటాయించకపోయినట్లయితే planning అనే దానిలో అర్థంలేదు నిజంగా ఇచ్చుకోగలిగినటువంటి ధనవంతులమీద వేసేటటువంటి Income tax Corporation tax Excise tax, Customs duties అన్నీ వాళ్లు తీసుకొని మీరు పన్నులువేయండి అంటే కేటిపైన పన్నులువేయగలము? ఇక్కడ ఉండేదంతా భూమిపన్ను, sales tax ఈ sales tax లో అనేకభాగాలు వాళ్ళే తీసుకొన్నారు పన్ను భరించగలవారిమీద వేసే పన్నులన్నీ వారిచేతుల్లోనే పెట్టుకొన్నప్పుడు వాళ్ళనే వేయమనండి అదనంగా పన్నులువేస్తే మాకేమి అభ్యంతరంలేదు ఇంకా రేపటినుంచి ఏదో hotels మీద పన్ను వేయబోతున్నారట తరువాత రైల్వేప్రయాణం చేస్తే Terminal tax అనేది పెడుతున్నారని తెలుస్తున్నది ఇటువంటి పన్నులువేసి ప్రజలను అనవసరంగా వ్యతిరేకము చేసుకోవడంతప్ప మరేమిలేదు ఈ భూములమీదపన్ను వేసేవిషయంలో ఎకరానికి ఇంత లోను అంటే ఒప్పుకోము కావలసి వస్తే ground tax తీసుకొంటే మరేమి అభ్యంతరంలేదు ఎక్కువ ఆదాయముగల వారిపైన, ఎక్కువభూమి ఉన్నవారిపైన వేస్తే దానిని మేము బలపరుస్తాము తక్కువఆదాయం వచ్చేవారిపైనవేస్తే మాత్రం మేముపూర్తిగా వ్యతిరేకిస్తాము అదేవిధంగా sales tax విషయంలో కూడాను Luxry goods మీద పెంచండి పెద్దపెద్ద వ్యాపారాలుచేసి లాభాలుతీసుకొనేవాళ్ళమీద పడేటట్లు sales tax ను సవరించండి ముఖ్యముగా విదేశకంపెనీలు మనదేశమునుంచి ఏదైన కొని తీసుకొనిపోతామంటే వాళ్ళమీద పన్నులు వేసేదానికిలేదు ! ఈ sales tax అలాంటి వాళ్ళమీద పడేటట్లు చూడండి Purchasing tax క్రిందనే పన్ను ఇంకోరకంగా మార్చండి వాళ్ళు ఖచ్చితంగా రైతులవద్ద కొనేటట్లు చూడండి అదికాకుండా, వారిమీద పన్ను వేస్తాము, తలమీదవేస్తాము, తోకమీదవేస్తామంటే ప్రయోజనంలేదు

ఆఖరుకు నేను చెప్పేది యేమిటంటే, మనకు యీ plans అన్నికూడా సక్రమంగా జరగాలంటే ప్రభుత్వానికి ప్రజలయొక్క సహకారము కావల్సివుంటుంది ఈరోజున ప్రభుత్వయంత్రాంగము సరిగా నడవాలంటే, యిప్పుడువున్న విధానము మార్చుకపోతే, ప్రజల సహకారము పొందడము అసంభవము ప్రజలకోసం పనిచేస్తున్నామనే దృష్టికాకుండా, ప్రజలమీద పెత్తనంచేసే దృష్టి పెట్టుకోకూడదు అందుచేత ప్రజాప్రతినిధులు అనే స్థాయిలో ప్రజాప్రతినిధులతోపాటు వారియొక్క సలహాలు తీసుకుంటూ యీ ప్రభుత్వకార్యక్రమాలు కొనసాగించాలి ఒకవేళ ప్రభుత్వము వారు, ప్రజాప్రతినిధుల అభిప్రాయాలతో ఏకీభవించకపోతే, పైవారికి తెలియచేయండి అటు తరువాత పైవారు చెప్పినప్రకారము చేయండి అట్లాగా జరగకుండాపోతే, యీ ప్రభుత్వముయొక్క కార్యక్రమము సరియైనదారిలో నడిపించడానికి సాధ్యముకాదు అందుచేత యీ సిద్ధాంతాలనుబట్టి, నిజంగా ప్రజలను ప్రోత్సహించాలంటే వారికి భూమియివ్వండి వారియొక్క ఆదాయము ప్రతిసంవత్సరమూకూడా పెరిగేటట్లుగా చేయండి వారికి కావలసిన విద్య, వైద్యసౌకర్యాలు అన్నీ యివ్వండి ప్రభుత్వోద్యోగస్థుల జీతాలక్రింద గాని, వారియొక్క పిల్లలకు చదువుచెప్పించటానికిగాని, యింకా 25 కోట్ల రూపాయలు అదనంగా చేర్చి, యిదివరకు యిచ్చిన ప్రణాళికలో కొంత ఖర్చు తగ్గించుకుంటే, యింకను కేంద్రప్రభుత్వమునుంచి యింకా కొంతసొమ్ము సాధించగలిగినట్లయితే, యీ సొమ్ము అంతాకూడా ప్రజలకుగాను ఖర్చుచేసినట్లయితే ప్రజల

యొక్క సహకారము, ఉత్సాహము పొందటానికి వీలుంటుంది ఇప్పుడు యీ ప్రభుత్వము 500 కోట్లు అడిగారు దానికి యింకొక 50 కోట్లు ఉద్యోగస్థులకోసం, ఉపాధ్యాయులకోసం ఖర్చుచేయటానికి కోరడము అది యేమాత్రము ఎక్కువ యేమీ కాదు నిజంగా ప్రభుత్వముయొక్క ఆశయాలు సాధించడానికని ఆలోచించినట్లయితే మరొక యాభైకోట్లు ఎక్కువ యేమీకాదు కాబట్టి ఆరీతిగా చేయాలని ప్రభుత్వాన్ని కోరుకున్నాను

ఈవిధంగా ప్రభుత్వము చేస్తున్నప్పుడు ఈ ప్రణాళికను ముందుకుతీసుకొని పోవటానికి అన్నిపార్టీలవారికి వీలువుంటుంది అందుచేత భేదాభిప్రాయాలు లేకుండా పెరిగిన ఆదాయము ముందు ఎవరికిచెందాలి? ఎవరిమీద పన్నులువేసి దీన్ని సాధించాల్సి వుంటుంది? భాగ్యవంతులమాట అటువుంచి, ముందు పేదవాళ్లయొక్క ఆదాయము పెంచాలని అంటున్నాను భాగ్యవంతులమాట ఆతరువాత చూద్దాం, అనేటటువంటి సిద్ధాంతము ప్రభుత్వము అంగీకరించినట్లయితే అప్పుడు అన్నిపార్టీలవారు యీజాతీయాభివృద్ధికోసము తయారుచేసిన ప్రణాళికను ముందుకుతీసుకొనిపోవటానికి వీలుగా వారియొక్క ఉత్సాహమును, అంగీకారమును యిచ్చి సహాయపడతారని చెబుతున్నాను మంత్రిగారు దీన్ని గమనించవలసిందిగా కోరుతూ ముగిస్తున్నాను

The Hon Sri K VENKATA RAO — అధ్యక్షా, Opposition Party లీడరుగారు నాకు కొంతబరువుతగ్గించారు కాని నేను యీ ప్రణాళిక విషయమై ఎక్కువసేపు మాట్లాడటానికి అవసరములేకుండా, నాకు యిప్పుడు యిచ్చిన అవకాశము 45 నిమిషాలే కాబట్టి, నేను యీచిన్న అవకాశములోనే, నేను చెప్పదలచిన విషయాలను అన్నీచెప్పి ముగించటానికి ప్రయత్నముచేస్తాను వీలుగాఉంటే, యింకను అంతకుముందుగానే పూర్తిచేసి కొంత విరామము వుండేటట్లు చూస్తాను—

నిన్న యీ రోజుకూడా చాలామంది సభ్యులు యీ Plan ను గురించి వారి వారి అభిప్రాయాలను వెల్లడించడము అయింది ఈ చర్చలు చాలా తీవ్రమైన విమర్శలు వస్తాయేమోనని, యిప్పటికి నాలుగు వారములనుంచి, యీ Plan కు సంబంధించిన పుస్తకాలు అన్నీ తిరగవేస్తూ, కాలముగడిపాను కొన్నిపుస్తకాలు మన స్నేహితులు కొంతమందికి, వారియొక్క అభిప్రాయాలుకూడ చెప్పటానికి వాటిని అందజేశాను కాని, మొత్తముమీదచూస్తే, విమర్శలు మాత్రము ఎక్కువగా రాలేదు అందుకు సభ్యులకు నాయొక్క కృతజ్ఞత తెల్లడించుకోవాల్సివుంది మన ప్రభుత్వము ఏ ఆశయాలతో యీ Plan ను అమలుపెట్టదలచిందో అవిఅన్నీ గూడా మరల పునరుద్ఘాటనచేయవలసిన అవసరము లేదని నేను మీకు తెలియజేస్తున్నాను అందువల్ల యీ రోజున వచ్చిన విమర్శలలో subjectwari గా తీసుకొని చెప్పటానికి బదులు, మొట్టమొదట యీ విమర్శల general lay out ను గురించి చెప్పదలచాను అంటే Planning కు మొత్తము 244 కోట్లు వుండాలా! లేక అంతకంటె ఎక్కువగా వుండాలా! అనే విషయాన్ని గురించి చాలామంది సభ్యులు కొన్ని విషయాలలో వారికి తగిన సూచనలు యిచ్చారు తక్కిన విషయాలను గురించి, యిందులో కొద్దిమంది సభ్యులు మాత్రమే సూచనలు చేశారు Items ఎక్కువచేస్తే బాగుంటుందని కొంతమంది అన్నారు చివరకు సుందరయ్యగారు మరొక యాభైకోట్లు అయినా దానికి చేర్చితే బాగావుంటుందని సూచించారు ఈ 250 కోట్లేకాదు యింకా 500 కోట్ల వరకు పెంచినాకూడా నాకేమి

అభ్యంతరములేదు కాని ఎన్నికోట్లు అయినప్పటికినీ, దానికి అవకాశము, సావకాశము వున్నదా, లేదా అనేది మనము చూచుకోవాలి అంతేకాని ఊరకనే దీన్ని పెంచు కుంటూవెళ్ళే ఉద్దేశ్యముతో నేను ఢిల్లీకివెళ్ళి ప్రయత్నిస్తే, చివరకు నేను disappoint ment తో తిరిగి రావటానికి నాకు యిష్టములేదు ఆ విధంగా నేను తిరిగి రాదలచుకో లేదు కొంతమంది సభ్యులు చెప్పింది యేమిటంటే, యితరరాష్ట్రాలలో వారు 600 కోట్లు 700 కోట్లు వేశారు కాబట్టి మనరాష్ట్రములో అధమపక్షము 500 కోట్లయినా వేయ కూడదా అని అన్నారు

Sri N VENKAYYA — Point of order, Sir రాష్ట్రములోని విస్తీర్ణాన్ని, జనాభాను అనుసరించే, మరు 350 కోట్లు అనేది అధికముకాదని మనవి చేస్తున్నాను —

The Hon Sri K VENKATA RAO — వెంకయ్యగారి లెక్కలకు నేను చాలాసంతోషించాను అందుకు నేను కృతజ్ఞుడను ఈ లెక్కల ప్రకారముగా ఇండియాదేశము అంతటుకూడా పెట్టేసమయములో, మనకు ఒక్కరికి 350 కోట్లు యిచ్చివేస్తే 700 కోట్లుకాదుగదా, 15 వేల కోట్లు పెట్టుబడికూడా సరిపోదనేసంగతి వారుగుర్తించుకుంటే చాలు మనజనాభాను బట్టి, 350 కోట్లు వస్తుంది అందుకు మన అవసరాన్ని బట్టి అయినా మనము వెళ్ళాలిగాని, లేకపోతే మన శక్తిని బట్టిఅయినా మనము వెళ్ళాలి మన అవసరాన్ని బట్టిఅయితే, 350 కోట్లుకాదు, 700 కోట్లకు కూడ లిస్టు నావద్ద వున్నది అదికాదు మనశక్తినిబట్టి అన్నారా అంటే, యీ 250 కోట్లకే మన పనులు చాలాకష్టముమీద జరుగుతాయి ఈ సమయములో నాకు ఒక చిన్నకథ జ్ఞాపకము వస్తున్నది ఒక కుర్రవాడిని, నీవుచూచిన చేపపొడుగు ఎంతఅని, వాడి మేష్టరు ప్రశ్నించితే, "నాకు తెలియదండీ, మాసాయన భోజనము చేసేటప్పుడు ఆయన ఎప్పుడో పట్టుకున్న చేప పట్టుకున్న రోజుదగ్గరనుంచి దినమునకు ఒక అడుగు పెరుగుగూ వుంటుందని చెప్పాడని", జవాబుచెప్పాడు అంతే యీ రోజున పట్టుకున్న చేప మూడు అడుగులు పొడుగువుంటే, రేపు తను పట్టుకున్న చేప దినమునకు నాలుగు అడుగులు వుంటుందని చెప్పాగూ వెళ్ళేరీతిగా ఆ సామెతున్నది అదేమాదిరిగా యీ plan ను గురించి మనము discuss చేసినప్పుడల్లా, దీన్ని మనము కొంచెము కుదిమట్టుసరిగా అందుబాటులోకి తీసుకొనివచ్చే మార్గాన్ని వదిలిపెట్టి తరువాత దాన్ని పెంచుకునేమార్గం పట్టుకుంటే తరువాత దీన్ని సాధించే శక్తి రాష్ట్రములో యీ రోజునలేదు అని చెప్ప డానికి నేను విచారిస్తున్నాను నాకు అక్కరలేదని కాదు మనకు అవసరము లేదనికాదు నా వాదన కాని మనయొక్క శక్తిసామర్థ్యాలు కొంచెము కుదిమట్టుముగా వున్నవని నాకు విచారముగా వున్నది మనము భారతదేశములో పుట్టుటమే కొద్దిపాటి కుదిమట్టమైన బీద దేశములో పుట్టాము అటువంటి ఆంధ్ర దేశములో పుట్టిం దున ఆ కుదిమట్టమునకు యింకా కొంచెము కుదిమట్టము చేర్చుకోవలసిన పరిస్థితిలో వున్నాము భారతీయుడు గానూ, ఆంధ్రుడు గానూ కూడా మనకువున్న స్వల్పమైన resources ను గురించి నేను చాలా విచారిస్తున్నాను కాని మనకు యింకొక మార్గములేదు తరువాత రాబోయే generation మన capacity ని బట్టి మనము చేసిన కృషివల్ల ముందుకు వెళ్ళేవారికైన అనుకున్న రీతిగా ఆనందదాయ కముగా వుండే పరిస్థితిలో వారు ఉండేటట్లు చేయడానికి మనము చేసేయత్నము మీద

ఆధారపడి వుంటుందని మనమందరము గుర్తుంచుకోవాలి సరే నేను చెప్పవలసిన విషయములో సుందరయ్యగారు నాకన్న ముందుగానే చెప్పారు నిజంగా 200 కోట్ల రూపాయలేకాదు అసలు పన్నెండు నూరు కోట్లో, రెండువందలకోట్లో లెక్కలలో చూపించవలసి వున్నది అంటే కేంద్ర ప్రభుత్వము రాష్ట్రములలో ఖర్చుపెట్టబోయే సొమ్ము యిప్పుడు తన చేతులలో పెట్టిన Plan లో లేదు వారు ఆ వివరాలు అన్నీ కూడా చెప్పారు మరల నేను వాటిని గురించి చెప్పనవసరములేదు వాటి అన్నిటికోసం మన ఆంధ్ర దేశములో ఎంత ఖర్చు అవుతుందనే విషయము చూస్తే యీ రెండువందల నల్గైనాలుగు కోట్లేకాదు దీనికి తోడుగా యింకొక నూరు కోట్లో, రెండు వందల కోట్లో యింకా అంతకంటే ఎక్కువగానే private sector లోను Caltex, Hindustan Shipyard వగైరాలలో Government of India వారు ఖర్చు పెట్ట దలచుకున్నటువంటి ఏలాంటి Central Industries లో నైనా గాని, మనం యిప్పుడు పెట్టుబడి పెట్టేదాన్ని గాని, ప్రజలవద్ద నుంచి వచ్చే సహకారాన్ని గాని private sector లో యితర industrialists పెట్టుకునే పెట్టుబడివల్ల గాని, మనము వారు ప్రజలు కలసి పెట్టే industries వల్లగాని యీ యొక్క మొత్తము యింకా ఎక్కువ అవుతుందనే విషయము మాత్రము నిజము ఇప్పుడు మరొక విషయం చూడాలి పైన చెప్పిన 4,800 కోట్ల రూపాయలు public sector లో ఖర్చు కాబోతున్నదని ప్రతి రోజూ కూడా మనము పేపర్లలో చూస్తున్నాము ఈ 4,800 కోట్ల రూపాయలలో ఆంధ్రరాష్ట్రము యొక్క వాటా ఎంత? అది జనాభా మీదనా, లేక రాష్ట్రముయొక్క విస్తీర్ణము మీదనా, దేనినిబట్టి చూచుకోవాలి? జనాభాను బట్టి చూస్తే 5 9% వస్తుంది వైశాల్యమును బట్టి చూస్తే 1/18% వస్తుంది ఈ రకంగా యివ్వాళ మన రాష్ట్రముయొక్క పరిస్థితి విషయములో నేను సుందరయ్యగారితో ఏకీభవిస్తున్నాను ఈ విధంగా చూస్తే మనము ముందుకు వెళ్ళడం అనేది చాలా కష్టతరము అయిపోతుంది అందుచేత యీ రోజున మనకువున్న backwardness ని పరిస్థితిని కొంతవరకు మనము చేతులో కలిగిన దానికంటె ఎక్కువగా కేంద్రమునుంచి సహాయము కోరవలసిన న్యాయము వున్నది ధర్మమువుంది అందువల్ల మనము ఆ ప్రయత్నము తప్పకుండా చేస్తాము అని మనవి చేస్తున్నాను

Sri P SUNDARAYYA — ప్రభుత్వము 4,800 కోట్లు ప్రయివేటు సెక్టారునుంచి 3,400 కోట్లు తరువాత 2,200, మొత్తము 5,600 కోట్లు administration కోసం యీ అయిదుసంవత్సరాలకు మొత్తముమీద కేంద్రప్రభుత్వమునుంచి రాష్ట్రప్రభుత్వంనుంచి అంతాకూడా కలిపి యింకొక అయిదువేలు, పదివేలు అంటే మొత్తముమీద 10,500 కోట్లు ఖర్చు లెక్కలోకి తీసుకుంటే, దానిలో మన జనాభా లెక్కలప్రకారము 550 కోట్లరూపాయలు ఖర్చు కేటాయించటానికి మనకు హక్కు వుంటుంది అందుచేత మనము కేంద్రమును ఎక్కువగా ఏమీ కోరడంలేదు మనము వెనుకబడినదానివల్ల మనకు అదనంగా కేంద్రప్రభుత్వము యివ్వవలసేవుంటుంది

The Hon Sri K VENKATA RAO — నేను యిప్పుడు మాట్లాడేది public sector ను గురించి 4800 కోట్లరూపాయలలో, రైల్వేసుక్రింద వారు పెట్టబోయే Heavy Industries Department క్రింద 2,000 కోట్లు వారు కేటాయించదలచుకున్నారు ఇంక మిగిలింది 2,800 కోట్లరూపాయలు ఇది 26 రాష్ట్రాలలో మా

ద్వితీయ పంచవర్షప్రణాళికలో public sector లో ఖర్చుచేయవలసిన అవసరం కనబడుతున్నది ఇప్పుడు నేను మీరు యిచ్చిన పుస్తకము యీ sector కు సంబంధించి ది కాబట్టి పైచెప్పిన అంకెలనుగురించి నేను తీసుకోవడములేదు తాను ఖర్చుపెట్ట దలచుకున్న 2800 కోట్లరూపాయలలో మనకు సహజముగా రావలసిన వాటా ఎంత, మనము కేంద్రమునుంచి కోరవలసింది యేమిటి, తెచ్చుకోవలసినది యేమిటి అనే విషయాలన్నీ నేను మీకు మనవిచేస్తున్నాను అందుచేత మి యొక్క అవసరాలనుబట్టి మనము యీ ప్రణాళికను తయారుచేసుకున్నాము ఇదే ప్రణాళిక మనజిల్లాలోవున్నది ఇది చాలా flexible plan అని పండిట్ నెహ్రూగారుకూడ అన్నారు ఈరోజున మనము యీప్రకారము లెక్కలువేసుకున్నప్పటికినీ రాబోవు ఒక సంవత్సరములోనో, రెండు సంవత్సరాలలోనో మనదేశమును యేరకంగా మనము మార్పుచేసుకునే అవకాశము వుంటుందో మనకు తెలియదు కాబట్టి దాన్ని మార్పుచేసుకునే అవకాశాన్ని దృష్టిలో పెట్టుకునే వేసుకోమని అన్నారు అటువంటి సావకాశమును మన చేతులలోపెట్టుకునే మన వ్యవహారమును మనము నడిపించుకుంటున్నాము

ఇక రెండవవిషయము యేమిటంటే, నిరుద్యోగ సమస్యనుగురించి కొంత విమర్శ జరిగింది ఈ plan యొక్క ప్రధానోద్దేశము నిరుద్యోగసమస్య తీర్చటానికే ఇప్పుడు సుందరయ్యగారు తీవ్రంగా కృషిచేసి, విపులంగా కొన్ని అంకెలు మనకు చెప్పారు వారు చెప్పినది యేమిటంటే యిప్పుడు మనరాష్ట్రములో నిరుద్యోగులుగా ఎంతమంది వున్నారు ఎంతమందికి మనము ఉద్యోగాలు యివ్వగలుగుతాము, ఎంతమందికి యివ్వ వలసివుంటుంది, అనేటటువంటి వివరాలు అన్నీ చెప్పారు సుందరయ్యగారుయిచ్చిన అంకెలు అన్నీ సరియైనవేనని మనము అంగీకరించినప్పటికినీ, యీరోజున నిరుద్యోగులుగా వున్నవారందరికీ యివ్వగలిగిన సామర్థ్యమువుంటే, నాకేమీఅభ్యంతరములేదు ఈరోజున ఒకమనిషికి కడుపునిండా అన్నములేకుండా, కట్టడానికి శరీరమునిండా బట్టలేకుండా, నివసించటానికి సరియైన యిల్లులేకుండా ఉండడము చాలా గర్హ్యనీయమైన విషయము అయితే దీనికి వారే జవాబుకూడా చెప్పారు మనది ఎన్నోసంవత్సరాలుగా విదేశీయుల చేతులలో పరిపాలనలోవున్న దేశము అటువంటిది ఒకరోజున Alladin the Wounder ful lamp మాదిరిగా చేయాలని మనము చూస్తున్నాము లేకపోతే ప్రతిమనిషికి కావలసిన కనీసపుఅవసరాలు అంటే విద్య, వైద్య వగైరా సౌకర్యాలు అన్నీ కూడా కనుకకుశక్తి, యిదేనా ప్రభుత్వము కలిగించవలసిన ధర్మము? ఇందుకేనా ప్రజలు ప్రభుత్వముమీద ఆధారపడి యున్నది? కాబట్టి అటువంటి ఉద్దేశ్యము తోటే, అటువంటి భావముతోటే ప్రభుత్వము సాధించే కార్యక్రమముతోటే, ప్రభుత్వము యీ ప్రణాళికను తయారుచేసింది కాని ఒక్క విషయము గోమాత్రము క్షమాపణ చెప్పవలసి యున్నది అది యేమిటంటే Alladin the Wonderful Lamp మాదిరిగా ఎల్లుండిపొద్దునకే, పెళ్లికాబోయే పెళ్ళికూతురుకు యిల్లుకట్టించి యిచ్చేసామర్థ్యం ఈ ప్రభుత్వానికి దేశానికి లేదని చెప్పవలసివచ్చినందులకు నేను విచారించుచున్నాను

దీనికి సంబంధించిన విషయాలు ఇంకా చాలా వున్నాయి అవి యేమిటంటే small scale industries యిందులో employment విషయమున్నది ఇది వారు అంగీకరించారు మనము అంగీకరించాము Big scale industries పెట్టడము వల్ల mployment అట్టే అధికముకాదు కాని Big scale industries లేకపోతే

అసలు దేశముయొక్క ఆర్థికపరిస్థితే ముందుకు వెళ్ళడానికి వీలయ్యేటటువంటి స్థితి ఏర్పడు తుంది కనుక అవి వెళ్ళేలోపల తప్పకుండా వీటికి తగినటువంటి పరిస్థితులు కల్పించాలి కాని అంతమాత్రముచేత పూర్తవుతుందంటే, ఏ 1980 81 లో ఏమి అవుతుందో! ఎవరికీ తెలియదు. అప్పటికి నేను వెంకటరావు వుండడు, సుందరయ్య వుండడు ఎవరూ ఉండేటటువంటి గ్యారంటీలు కావు అప్పుడు ఎవరుబాగుపడుతారో ఆ సెలవిషయము మనము చూచుకోవలసిన ధర్మముకూడా వున్నది కనుక మేము ఇప్పుడు బ్రతికివున్న వాళ్ళకు చాలామందికి ఏదో ఒకవిధమైన ఉద్యోగము కల్పించాలి ఈ సందర్భంలో నేను వారి విమర్శనకు చెప్పగలిగిన సమాధానము ఏమిటంటే employment ఎంతమందికి వస్తున్నదా అనే విషయానికి ప్రాధాన్యత ఇవ్వవలసిన పరిస్థితిలో ఉన్నాము, కాని, employment ఇచ్చేటటువంటి వాళ్ళయొక్క living wage గాని minimum wage గాని fair wage గాని సిద్ధాంత రీత్యా దేనిని కూడా సాధించగలిగినటువంటి పరిస్థితుల్లో లేము ఇవాళ 10 అణాలతో ఎలా భోజనము చేస్తారని అడిగితే భోజనము చేయటంలేదా ? దీనికి ఆర్గ్యుమెంటు ఎందుకు ? 10 అణాలుగూడా లేనివారు ఎంతోమంది వున్నారు అదే విధము అని వాళ్లే అంకెలు చెప్పారు ఇప్పుడు మనయొక్క ధర్మము ఏమిటంటే మన రేషనింగు, control principle ఏమిటో ఆదేదృష్టితోటి వెళ్ళవలసిన పరిస్థితిలో వున్నాము. ఇవ్వాళ 100 పుంచాలు ధాన్యం పండాయి 100 పుంచాలు ధాన్యం అంటే ఒక్కొక్కరికి 15, 10, 5 పుంచాలు అధికంగా పండినవారు ఉన్నారు బొత్తిగా లేకుండా వున్నవారు కూడా వున్నారు అందువల్ల ఆఖరుకు కొంతమందికి అసలు ఏమీలేదు 50 పుంచాలు పండినవాళ్ళను వారిరీత్యా వారిని వదలిపెట్టక అందరికీ తలాక 2 సేర్ల ధాన్యము అయినా వచ్చేటట్లు పెట్టడమే రేషనింగు అంటారు ప్రొడక్షను తక్కువ ఉండి తినేవాళ్ళు ఎక్కువ ఉన్నప్పుడు అందరికీ అందుబాటులోకి తీసుకొని వచ్చేటట్లు ఎలా చేశామో, ఆ రకంగానే ఇప్పుడు వున్నటువంటి ఉత్పత్తి తక్కువవుండి, మనకు employable capacity, employing capacity కూడా తక్కువఉన్న పరిస్థితుల్లో మనయొక్క outturn పరిమితంగా వున్నటువంటి పరిస్థితులలో ideal conditions లో దేశానికి fair wage, minimum wage వగైరాలు Insurance, employment Insurance, Health Insurance ఇవన్నీ చేయలేము Social Services ఈ స్థితిలోనికి తేవలసినటువంటి పరిస్థి తులలో మనములేము కనుక యివ్వాళ ప్రధానమైన ఆశయము ఏమీలేకుండా వారికి సున్నలోనుంచి ఒకటిని కల్పించాలని కోరిక రెండును రెండు పెట్టిగుణిస్తే నాలుగవుతుంది నాలుగును, నాలుగుపెట్టి గుణిస్తే ఎనిమిది అవుతుంది అదిఅంతా అభిలషణీయమైనటు వంటి విషయము లెక్కగాని అసలు సున్నలో ఉన్నవాడికి సున్నకంటే ఒకటి ఎన్ని రెట్లుగొప్ప? రెండుకంటే రెండు రెట్లుగొప్ప 4 కంటే 8 రెండు రెట్లుగొప్ప కాని సున్నకంటే ఒకటి ఎన్ని రెట్లుగొప్పో ఇంతవరకు Mathematics solve చేయలేదు అందువల్ల యివ్వాళ కొంచము గొప్ప తక్కువగా ఆ సున్న పరిస్థితులలో వుండి వివిధమైనటు వంటి complement లేక తినటానికిలేక, beggarగా వుండి నికృష్టమైనటువంటి పరిస్థితుల్లో వున్నవాడికి ఈరోజు అణా, బేడా, పావలా చేతికి అందించడమువల్లనే దేశము ముందుకు వెళ్ళుతుందనే భావము కాని, వారికి అనువైన, సౌఖ్యకరమైనటువంటి పరిస్థితులు కలుగచేయక పోవడము అనే ఉద్దేశ్యములేదు అదిసాధ్యము అయితే యీ ఎండి నదిఖీంచడమూలాగే పల్లము వచ్చినప్పుడు రథము గబగబా పరుగెడుతుంది మెరక వచ్చి

నప్పుడు అంత తొందరగా పోలేదు పెద్దగిరాగా ఎక్కువుంది మొదట ఎక్కువ తరువాత తప్పకుండా తగ్గుముఖమవుతుంది ఈరెండైన రథము గుంటూరు పరిశ్రమలు వుంటూ యనే నేను అనుకొంటున్నాను ఇంకను ఉద్యోగాలు కల్పించే విషయంలో అనేకచర్యలు suggest చేశారు రామాచారిగారు పైనుంచి క్రిందకు కట్టుకువస్తున్నారని నన్ను అన్నారు కాని వారు లెక్కచేస్తుండంలో క్రిందనుంచి పైకి స్థాయిన్ని కట్టేశారు ఏవో కొన్ని లెక్కలు చెప్పారు 2 61,100 కోట్ల గంటలు పనిచేసినట్లవుతుందని అన్నారు నిజమే ఈ లెండుకోట్లమంది పనిచేస్తేమాకు అభ్యంతరం యేమివున్నది ? కాని పనికల్పించే స్థితిలో మనము లోపము చేస్తున్నాము వారు పనిచేయడంలో లోపము చేస్తున్నారు వారికి ఉన్నటువంటి బుద్ధి కౌశలమును మనము పూర్తిగా వినియోగించుకునే పరిస్థితిలోకి రాలేదు వారు చెప్పిన లెక్కలను 2,61,100 గంటలని కొంచెము తగ్గించి చెప్పారు పూర్తిగా అన్నిరోజులు, అన్ని గంటలు employable period అంతాకూడా పని చేస్తే అంతకంటే తక్కువే అవుతుంది ఆ పరిస్థితిగా రామాచారిగారు లేపున్నారుకారు మేముకూడా చేస్తున్నాము ఆ పరిస్థితులు ఏర్పడాలని అందరియొక్క కోరికకూడాను ఈ సందర్భంలో చిన్న పరిశ్రమల కోసం రైస్ మిల్లులు తీసివేయమని, జిన్నింగు మిల్సు తీసివేయమని ఇంకా ఇతర విషయాలు కూడా కొంతమంది సలెహ్లు చేశారు రైస్ మిల్లుకు సంబంధించినంత వరకు నేను ఒక విషయము మనవిచేస్తాను ఇప్పటికి గవర్నమెంటు పాలసీ కొత్త లైసెన్సులు యివ్వకుండా వుండాలనేటటువంటి నిర్ణయము జరిగింది జిన్నింగు మిల్లుల గురించి నాకు తెలియదు దీనిని గురించి మా ప్రభుత్వం విచారణచేస్తుంది తరువాత insufficient allocation ను గురించి అంటే ఇచ్చి నటువంటి సొమ్ము చాలదు అన్న విషయములో 3, 4 విషయాలు చెప్పారు (1) హరిజనాభ్యుదయానికి నాలుగు కోట్ల రూపాయిలు చాలవని కొంతమంది విమర్శించారు వారికి నామనవి యేమిటంటే ఈ 4 కోట్లే కాక ఇతర items లో కూడా ఈ హరిజ నాభ్యుదయానికి, వెనుకబడిన గతుల అభ్యుదయానికి ఇంకా కొన్ని సొమ్ములు కలపివున్నా యని మనవిచేస్తున్నాను ఉదాహరణ చెప్పాలంటే విద్యలోకలపివుంది, పబ్లిక్ వర్క్సులో కలపిఉన్నది village works లో కలపివున్నది ఇవన్నీ కూడితుంటే 4 కోట్లు కాదు ఇంకా చాలా పెద్దమొత్తమే వారియొక్క అభ్యుదయానికి ఏర్పాటయిందని మనవిచేస్తు న్నాము. ఎవరో ఒకలక్షఇండ్లు కట్టించమన్నారు కొంతమంది మళ్ళీఇండ్లుకట్టుకొనేందుకు ఉచితంగా స్థలము ఇవ్వమన్నారు కొంతమంది ఇండ్లుకూడా కట్టించి ఇవ్వమన్నారు కొంతమంది ఇండ్లు కట్టడానికి నగదుగ్రాంటు, నగదు లోను ఇవ్వమన్నారు గవర్నమెంటు వారుకూడా ఈ housing విషయములో వెళ్ళ కలిగినంతవరకు వెళ్ళారు ఇంకా మన calculation ఎక్కువ అయితే ఇంకో అడుగు ముందుకు వేయ డానికి ఏవిధమైన అభ్యంతరములేదు ఈ విధంగానే Medical గురించి Public Health గురించి కూడా విమర్శలు వచ్చాయి దానిని గురించి ఇంకొక నిముషము అయిన తరువాత చెబుతాను ఇంకొకరు శేషయ్యగారు ఆంధ్ర రాష్ట్రములోని mineral wealth ను గురించి ఏమీ చెప్పలేదన్నారు దానిలో provisons వున్నాయి Mineral wealth ఆంధ్రదేశములో వృద్ధిగా సంపద తెలుసుగాని ఇంతవరకు మన దురదృష్టమువల్ల ఏ particular mineral ఎక్కడ concentrate అవుతుంది అని గాని వివిధప్రదేశాల్లో ఎంత amount వున్నది అనే estimate గాని యింతవరకు తేలలేదు దీనికి మన రాష్ట్రములో 20 వేల చ॥ మైళ్ళు Geological Survey

వాళ్ళు map వేయడము 40 వేల చ॥మైళ్ళు ఇంకా map వేయకుండా వుండడమే ప్రధానమైన కారణము దానికిగను ప్రతిరోజూ కోరుతున్నాము Item వారీగా కోరుతున్నాము ప్రదేశాలగురించి కోరుతున్నాము వారు కొంత కృషి చేస్తున్నారు ఇది సర్వేగనుక అంగుళం, అంగుళంగా కొలుచుకు వెళ్ళవలసివున్నది గనుక కొంచెము ఆలస్యము అవుతున్నది ఈవిధంగా ఆలస్యం జరిగితే మనకు నష్టము అనే సంగతి ప్రభుత్వము గుర్తించి మనకు ఇప్పుడు deficit budget వున్నప్పటికీ కూడా కొన్ని వేల రూపాయలు మనము allocate చేద్దాము ఇప్పుడు ఆంధ్రదేశములో Industries కావాలని అడుగుతున్నాము ముందర కావలసినది coal సింగరేణి కాలరీ దగ్గర్తి అయిపోయింది కొత్తగూడెం వెళ్ళింది Next stage ఏమిటి ? ఎక్కడ నుంచి తెచ్చుకుంటాము? దక్షిణ హిందూస్థానములో ఎక్కడా కూడా coal లేదు రాష్ట్రముకాక నీళాలాంధ్రలో కాకుండా అసలు coal క [illegible] వస్తాంటుంది అసలు పైకి వచ్చి మళ్ళీక్రిందకు వెళ్ళుతుంది ఇప్పుడు సింగరేణినుంచి ఎయలుదేరి కొత్తగూడెం వెళ్ళుతుంది అప్పుడు మళ్ళీ గోదావరిఇవతలకు వస్తుంది అది ఎక్కడ వున్నదో locate చేయడము కోసం మనమే 90 వేల రూపాయలు ఖర్చుపెట్టి ఈ గవర్నమెంటు account లో Geological Survey వారిని తొందరగా చేయమని యత్నం చేస్తున్నాం యూనివర్సిటీ వారి సలహా పుచ్చుకొంటున్నాము Natural gas కోసం ప్రయత్నిస్తున్నాము దానికి ఏవిధమైన లోపము చేయడములేదు ఇంకా మనకు mines కొన్ని minerals కొత్త కొత్తవి locate అయినకొద్దీ వాటిని వినియోగించు కోవడములో ఏవిధమైనటువంటి అభ్యంతరము వుండదని నేను మనవిచేస్తున్నాను

Sri M NAGI REDDI — Point of order మొన్న కేంద్ర ప్రభుత్వం Geological Department వారిని East and West Godavaryలో coal deposits చూడమనిఅంటే, దానికి సామాను జారవేయడానికే ఆంధ్రప్రభుత్వం యిప్పుడు వీలు కాదుఅన్నారట యేమిటి ?

Mr SPEAKER — It is no point of order The Hon Members should not ask for information on a point of order

The Hon Sri K VENKATA RAO — వారు మమ్ములను ఒకసారి schedule అడిగారు అయితే అది మాదగ్గర లేకపోయింది మిగిలింది అంతా నేను దగ్గర ఉండికూడా కొంతవరకు మాయించాను అందుచేత వారికి వచ్చిన సమాచారము correct అయినదికాదు

తరువాత Industries దగ్గరకు వస్తాను Industries ను గురించి అనేకమైన సలహాలు యిచ్చారు భారీపరిశ్రమలనుగురించి చిన్నపరిశ్రమలనుగురించి చెప్పారు, ఈ సందర్భములో మొట్టమొదటవిషయము Industries కావాలన్నారు గనుక దానికి తగిన శిక్షణపొందిన personnel ను తయారుచేసుకుంటున్నారా అనే ప్రశ్న వచ్చింది దీని విషయము నేను ఇదివరకే మనవిచేశాను దీన్ని ఎక్కువచేసేవిషయము ఈ ప్రభుత్వ కార్యక్రమములో ఉన్నది ఇదివరకు ఉన్న Polytechnics కాకుండా ద్వితీయ పంచవర్షప్రణాళికలో ఇప్పుడు యింకా 2 Polytechnics, యింకా ఎక్కువగా Industrial Schools, Training Centres ఎక్కువగా పెట్టుతున్నాము ముఖ్య

ముగా కుటీరపరిశ్రమలవిషయములో ఒక్కొక్కరు ఒక్కొక్క సలహాచెప్పారు ఈ కుటీరపరిశ్రమలకు సంబంధించిన Training ఇవ్వడానికి గాజు beeds పున్నవని మొన్న చెప్పాను పాపానాయుడు పేటలో ప్రపంచమంతటను అతి సుందరమైన గాజు beeds తయారు అవుచున్నవి అది చాలా ఆశ్చర్యకరమైనవిషయము వాటికి కొంచెము కురుగు పెట్టగలిగితే, electricity వల్ల కొంచెము time ఇస్తే ఇటలీ ప్రాన్సులనుంచి import చేసుకునేవాటికంటె ఎక్కువగా మేలిరకంగా ఉంటవి వీటికి మన మార్కెటు రేటు 1-8-0 అయితే విదేశము నుంచి తెప్పించుకుంటే అవి 6—8—0 చొప్పన మనకు గిట్టుచున్నవి ఇంకా protection కావాలని అంటే Governmet of India వారికి యీ beeds ను గురించి protection యిచ్చే విషయములో వారికి నిన్ననే ఉత్తరం వ్రాశాను ఇప్పుడే beeds training కాళహస్తి, రేణిగుంట విశాఖపట్టణములలో పెట్టాము గాజుకొట్టారులో కూడా training ఇస్తున్నాము ఈ cottage industries లో leather, blacksmithy, carpentry విషయములో కూడా training centres పెట్టి వాళ్ళకు నేర్పడమే కాకుండా వ్యక్తిగతముగా పనిచేసుకుంటాము అని ఎవరైనా చెప్పితే 250/- నుంచి 500/- వరకు ఏవిధమైన security లేకుండా మాట నమ్మిక మీద వారికి అప్పుయివ్వడానికి ఏర్పాటుచేసుకొని, State aid to industries క్రింద ఎక్కువగా డబ్బుయివ్వవలచుకున్నాము ఇంకా పెద్దపరిశ్రమ పెట్టుకుంటామంటే ఎక్కువ మొత్తములు అయిదులక్షల రూపాయలదాకా అప్పు Investment Corporation ద్వారా యివ్వడానికి సిద్ధముగా యున్నాము

Investment Corporation ననుసరించి చెబుతున్నాను Investment Corporation సహాయము చేయాలని మన ప్రణాళికలో ఉన్నది అందుచేత ఏవిధమైన ఇబ్బంది ఈ 5 సంవత్సరాలలో ఉండదని అనుకుంటున్నాను Engineering ను గురించి ఎవరుచెప్పారు వారు చెప్పిందిఏమిటంటే ఒక్క కాలేజీపెట్టారు ఇంకా ఎక్కువ పెట్టాలని అన్నారు మాకు వచ్చిన లెక్కలప్రకారము ఈ మూడుకాలేజీలలో 1958 59 సంవత్సరమునకు అనగా సరిక్రొంత మంచి ఉచ్ఛదశలో ఉన్నప్పుడు మనకు కావలసినంతమంది Engineers తయారవుతారు అనిఉంది ఇంకా అవసరమయితే ఇంతమారము చెల్లించేవారము ఇంకొక Engineering College పెట్టడానికి అభ్యంతరములేదు వెంకటేశ్వర్లు లాంటి వారు కొంచెము ప్రజాసానుభూతికల్గింది అనే చెప్పేవారు ఉంటే అట్లాగే చేస్తాము Mysore Srinivasa Medical College ప్రతి మనిషిదగ్గర రెండు, మూడు వేలు donation పుచ్చుకొని కట్టారు దానికి కట్నాల College అని పేరు అలాగే ఇక్కడకూడా వెంకటేశ్వర్లు లాంటివారు వసూలుచేసిపెట్టవచ్చు అట్లాంటివారు కాలేజీలు పెట్టినట్లయిన గవర్నమెంటు ఇచ్చే సహాయము ఇస్తుంది ఆవిధముగా చేస్తే ఆంధ్రరాష్ట్రంలోని డబ్బు ఇంకొకరాష్ట్రములోనికి పోదు

The Hon Sri B GOPALA REDDI — కట్నాల కాలేజీగా ?

The Hon Sri K. VENKATA RAO — కట్నాల కాలేజీ అనే దానికి పేరు ఒక్క కృష్ణా జిల్లావంటే 1 లక్ష 28 వేల రూపాయల డబ్బు మైసూరు కాలేజీకి వెళ్ళినదని వాదుక

ఇంకా fisheries ను గురించి చెప్పారు నేను దానిని గురించి గట్టిగా చెప్పడానికి నాకు అనుభవములేక బాధపడుచున్నాను సుబ్బారాయుడుగారు పెద్ద చేపలను గురించి చిన్న చేపలను గురించి చెప్పారు మిగిలిన వాళ్ళు పెద్ద చేపలను చిన్న చేపలను తొందరగా తినివేయుచున్నవని చెప్పారు అందుచేత దానికి తగిన ఏర్పాటు కొంచెము ఇప్పుడే జరిగింది ఇంకా ఏర్పాటు తొందరలోనే చేస్తారని మనవిచేయుచున్నాను

తరువాత Industrial Corporation ను గురించి కొంతమంది చెప్పారు దానికికూడా provision ఉన్నది ఒకరు ఇద్దరు కాకుండా నలుగురు, అయిదుగురు గాని పదిమంది అయినా కలిసి ఏ production element అయినా తీసుకవస్తే దానికికూడా ప్రభుత్వం సహాయము చేయుటకు సిద్ధముగా నున్నది నిన్ననే జపాను నుంచి వచ్చిన స్నేహితులు చెప్పారు కనుక కొత్త system లో unit ను ఒక చోట తయారుచేయకుండా ఆ unit కు కావలసిన basic material ఈ training centres లో తయారుచేసి ఎక్కడనుండి దానిని utilise చేసుకొని fabricate చేసే సౌకర్యము కల్పించే విధానము ప్రభుత్వం చూస్తున్నదని మనవిచేసున్నాను

తరువాత textile గురించి పుష్పల సత్యనారాయణగారు చాలా వివరములు చెప్పారు వారికి నేను చెప్పేది యేమిటంటే ఆంధ్రదేశములో ఇంతవరకు 1 లక్ష 80 వేల spindles allocation జరిగింది అయితే వారు 3 లక్షలంటే చాలునని అన్నారు కాని ఇప్పటికి 2 లక్షల 30 వేల spindles ను గవర్నమెంటు allocation చేసినది మిగిలిన 10 వేలుకూడా సిద్ధముగా నున్నవి వచ్చే 2, 3 నెలలలో ఆ allocation ను సాధిస్తాము అని నేను అనుకొనుచున్నాను తాడిపత్రిలో సుబ్బారాయుడుగారు కృషి చేసి ఒక Textile factory స్థాపించారు నంద్యాల గురించి ఒక కొత్త application వస్తుందని విన్ననే మాకు వార్త వచ్చింది ఇంకా ఎక్కడైనా ఇష్టము వున్నవారున్నచో ఇంకా 2,3 factories పెట్టితే ఇంకా 70 వేల spindles కు పెంచడానికి వీలుందని మనవి చేస్తున్నాను తరువాత ఇంకొక స్కీమును గురించికూడా చెప్పారు 1000 spindles ఒకచోటపెట్టి common grow room and sliver room పెట్టి గ్రామములకు ఈ నూలు కట్టుకట్టి సప్లై చేసే దానికంటే ఒక పెద్ద చక్రముతో తాళ్ళు పడుగులు తయారు చేయాలనే స్కీము ఉన్నది అధికంగా కొంతమంది సలహాలుచెప్పారు అది పూర్తి అయితే యీ వ్యవహారము యింకా సానుకూలము అవుతుందని నేను మనవిచేస్తున్నాను

తరువాత Cement in public sector కావాలని చాలామంది వెల్లడించారు. ఈ విషయమై కృషి చేశాము ఇంకా కృషి చేయడానికి ఏమి అభ్యంతరము లేదు Government of India వారు మనకు లైసెన్సు యిచ్చి పెట్టుకొనిచ్చినట్లయిన ఇంకా ఖనిజములకు demand ఉన్నట్లయితే ఈ ఖనిజములకు సంబంధించిన factory లను పెట్టడానికి అభ్యంతరము లేదు మనకు ఖనిజములు చాలా ఉన్నవి వీటిలో ఎక్కువగా దొరికే clay cements stone ఇంకా వంద factory లకు 3 వేల సంవత్సరములకు సరిపోయేటంత ఉన్నది మన ఒక్క నాగిరెడ్డిగారే అయిదు మిల్లులకు సప్లై చేయగలరు ఈ విషయమును గురించి తరువాత cottage industries గురించిఇప్పుడే మనవిచేశాను ఈ cottage industries లో blacksmithy కు training ఉంటుందా అని రామకృష్ణరాజుగారుఅడిగారు అటువంటిది ఉన్నదని నేను

4th August 1955] (Sri K Venkata Rao)

చెప్పారు ఇన్ని items కు కూడా Training లో production centres క్రింద ఏర్పరచటానికి మేము ప్రయత్నిస్తున్నాము

ఇంక Agrarian Reforms ను గురించి ముగ్గురు, నలుగురు mention చేశారు ఈ విషయాన్ని గురించి ఇంతవరకు నా మిత్రులు ఈ సభలో కొన్ని విషయాలు చెప్పారు దానిమీద కొంతవరకు వారికి యీ గవర్నమెంటు తీసుకొని వస్తుందో రాదో అని నమ్మకము కలిగించడమే నావిధి మేము సంకల్పించిన పరిస్థితిలో ఈ విషయములో మేమి ఏవిధముగానైనను యితర రాష్ట్రములకు గాని, Planning Commission యిచ్చిన సిఫార్సులకు గాని వ్యతిరేకముగా చేయదలంచుకోలేదు అయితే వాటిని సాధించుటకు నాలుగు రోజులు పట్టవచ్చు కాని ఈ cottage industries ను వెనుకకు తోసివేసే విధానములేదు ఈ reform ముందర పెట్టి తరువాత plan పెట్టాలని ఇద్దరు ముగ్గురు చెప్పారు కాని ఈనాడు main line మీద నడిస్తే బాగుంటుందని నేను అనుకున్నాను

(1) "Five Year Plan provides that the existing tenant should be confirmed in the enjoyment of occupancy rights subject to the land lord's limited area for personal cultivation"

వారు అడిగినది కూడా అదే తరువాత

(2) "Only those who cultivate the land themselves should be allowed to preserve land and within a period of five years

(3) "The tenants of non resumable areas should have the right of purchase, the price being a multiple of the rental value payable in instalments Infuture tenancy should be eight to 10 years and should be renewable' Rents should ordinarily not exceed 1/4 to 1/5 of the gross produce" అని ఉన్నది

ఇవన్నీ Planning Commission వారు చెప్పారు ఈ విషయములో మన సంఘము విచారిస్తున్నది ఇవన్నీ విచారించి వాటికి అనుగుణముగా యీ దేశముయొక్క పురోభివృద్ధికి రైతులు సహాయముచేసే విధముగ జరుగుతుంది రైతులకు న్యాయముగా సహాయము చేసినది కాంగ్రెసు ప్రభుత్వమే మిగిలినవారు ఇంకా chance రాలేదని అంటారు గాని chance వచ్చినా ఇంతకంటే విపులముగా వారు చేసేది ఏమీలేదు (Interruption) జమీందారులకు భూములు ఎన్ని ఉన్నవో వెంకట్రావుగారికి తెలియదు ఆయనకు ఒక్కటే కలలోనికి వస్తున్నాడు నాకు తెలును ఆయన అందరితో బాటు తప్పదనే పరిస్థితులు వస్తాయని నేను మనవిచేస్తున్నాను (Interruption పేరు చెప్పండి ) నేను ఎవ్వరి పేరు చెప్పదలచలేదు విజయనగరం మహారాజా వంటివాడికి 200 ఎకరాలు కన్న ఎక్కువ భూమిలేదు ఆయన ఈ సభలో సభ్యులు ఆయనకు ఎంత వున్నదిన్నీ వారిని అడిగితే చెబుతారు

"The Commission recommended the composition of a ceiling on the amount on land that the individual may have held, ఇవన్నీ Planning సిఫార్సులలో ఉన్నవి Land ను socialise చేయాలని కూర్మయ్యగారు చెప్పారు కాని ఆయన సంకల్పం పెట్టిన ప్రణాళికలో land socialisation ను గురించి లేదు అందుచేత Nationalisation మేము సంకల్పించడములేదు మేము చెప్పిన పద్ధతిలో ముందుకు వెళ్ళడానికి వీలుంటుంది గాని, వేరే మార్గములేదు అని మనవిచేస్తున్నాను

తరువాత Marketing Societies agricultural level of prices వ్యాపారాలను గురించి చర్చజరిగింది ధరల stability కొరకు ప్రభుత్వము పూనుకొంటున్నది ఇంకా దానిని గురించి విపులమైన కృషి చేస్తామని మనవిచేస్తున్నాను

ఈ సందర్భంలో animal husbandry గురించి చాలమంది మాట్లాడారు దీంట్లో మేము పెట్టగలిగినంతలో పూర్తిగా పెట్టాం అనే నా నమ్మకం దానిలో ఆవులను, గేదెలను, మేకలను, కోడిపెట్టలను వీటిని లెక్కవేస్తే కాదు దానిలో total provision animal husbandry కి ఎంతవున్నది, ఏరకంగా వ్యవహారం జరుగుతున్నదని చూచుకుంటే మన present plan కు adequate గా వున్నదని అనుకుంటున్నాను కొంతమంది పశుసంపదను అందమయినవాటిని అభివృద్ధి చేయాలని చెప్పారు అందువల్లనే artificial insemination centres కూడా పెడుతున్నారు ఒకరు Family Planning క్రింద కూడా చెప్పారు ఈ artificial insemination centres ఈ కర్నూలుజిల్లాలో అప్పుడే start చేశారుకూడా మహానంది వెళ్ళేవాళ్ళు త్రోవలో చూడవచ్చు, దానిలో నున్నది దానిని చూచినతరువాత మిగిలిన ప్రదేశాలలో ఎక్కడయినా వీలయినచోట పెట్టడానికి అభ్యంతరంలేదు

Sri PRAGADA KOTAIAH — వీటిని తగ్గించే ప్రయత్నం వున్నదా ?

The Hon Sri K VENKATA RAO — మనుష్యుల్ని తగ్గించాలంటే వింటున్నారా ? పశువులు వింటాయా ? వాటి త్రోవను అవి వెళుతూనేవుంటాయి ఇది యింకా మంచిరకంగా తయారుచేయడానికి వాటిని అరికట్టేశక్తి మనుష్యుల చేతులలోనే లేనపుడు జంతువుల చేతిలో అసలే వుండదని నేను అనుకుంటున్నాను నా విషయంలో నిజమై వుండవచ్చు మీ అందరివిషయంలో నిజంకాదు తరువాత Commercial Trade Corporation ఒకటి పెట్టవలసినదని ఒకరు suggestion యిచ్చారు Commercial Trade Corporation లో వున్న బాధ ఎక్కడున్నది అంటే variable prices వున్నపుడు మనకు హిందూదేశంలోపండే పంటలు హిందూదేశంలోనే అమ్మకవిధానం ఏర్పాటు చేసినట్టయితే యిది successful గా operate అవుతుంది కాని మనకు world market తో సంబంధంవుంది America marke లో wheat రూపాయికి 5 శేర్లంటే India లో 3 శేర్లు maintain చేయడం కష్టం 6 శేర్లలో maintain చేయడంకూడా కష్టం అందువల్ల యిప్పుడు wheat అంతా radio ద్వారాలతోనిండి అక్కడ price కాస్త fall అయినప్పటికీ 5 నిముషాలలో తెలుసున్నది ఇక్కడ radio ల ఖర్చంతా వర్తకులదే వారు రేడియో దగ్గర పెట్టుకుని సాయంత్రం 6½ గంటలకు వ్యవహారం వింటూవుంటారు అందువల్ల Government hand పెట్ట

కోవడంవల్ల యీ fluctuating prices లో చాలా difficulty వున్నది మనకు వీల
యినంత stabilize చేయటానికి యత్నం చేసుకోవాలి గాని యిప్పటి పరిస్థితులలో
మనము trade లో వేలుపెట్టడం కష్టమవుతుందని అనుకుంటున్నాను తరువాత కొంత
మంది Co operative credit గురించి మాట్లాడారు సుందరయ్యగారు కూడా
మాట్లాడా అన్నారు దానిలో బీదవాళ్ళు వగైరాలు చేరని ఇది భాగ్యవంతులకే
restrict చేయలేదు పేదవారికి యిచ్చారు తోళ్ళు కుట్టుకొనేవాళ్ళకి యిచ్చారు వాళ్ల
దగ్గర యేమున్నది? ఆ కుట్టేటటువంటి దారం- ఆ చేతులు ఉన్నాయి అవి తప్ప అతని
దగ్గర tools గాని costly instruments గాని లేవు అని నమ్మకం మాకు ఎక్కువ
ఎందుచేత అంటే, ఇప్పటికి 25 సంవత్సరాలనుంచి మొన్నటిదాకా ఒక Bank కు
Secretary గానో President గానో వున్నాను నా అనుభవం యేమిటంటే చిన్న
loans పుచ్చుకున్నవారు వాయిదా ప్రకారం తీర్చినట్టు యీ పెద్ద loans తీసుకున్న
వారు తీర్చరు అందువల్ల Co operative Credit వాళ్ళకు అందించడమే వుద్దేశం
అసలు మనమార్గమే సహకారమార్గం, ఇకపైన అదేమార్గం, అదేశరణ్యం ఆ దేశవ్యాప్తిలో
వెళ్ళేటప్పుడు తప్పకుండా బీదవాళ్ళను వెలుప పెట్టేటటువంటి సహకారసిద్ధాంతాన్ని
దేశంలో ప్రవేశపెట్టేయత్నం చేయుము అని నేను మనవిచేస్తున్నాను తరువాత వారియొక్క
ఉపన్యాసంలో Field Labour Co operative Societies ను యింకా ఎక్కువ
చేయవలసినదని కొంతమంది చెప్పారు Field Labour Co operative Societies
కావలసినన్ని వున్నాయి కాని నాకోర్కె ఏమిటంటే యీ Field Labour
Co operative వారు ఉత్సాహపరచవలసినటువంటివారు వాళ్ళకు ఉత్తేజం కలుగ
చేయవలసినదని కోరుచున్నాను చాల dormant societies వున్నాయి అవి
వందలాదిగా వున్నాయి వీటికి మనం లంక యిస్తాం ఇవ్వడానికి అభ్యంతరం
లేదు నేను సగర్వంగా చెప్పుకుంటున్నాను నేను Minister గా వుండి 8,100 ఎక
రాల లంక ఒక తూర్పుగోదావరిజిల్లాలో lease క్రింద యిచ్చాను కాని ఏమిజరిగింది?
చాలాకేసులలో అవిపట్టుకెళ్ళి ఊర్లో నోరవరికున్నదో వాళ్ళకు ఏ వెంకట్రావుగారికో
ఏ గోపాలరెడ్డిగారికో మళ్ళీ ఒక 400 రూపాయల లేదాలో యిచ్చేస్తున్నారు
అదీ difficulty అందువల్ల దానిని అరికట్టేమార్గాలుండి సమిష్టివ్యవసాయం చేసుకోడం
లేదు అంవరివుద్దేశ్యంలాగ 50 ఎకరాలిస్తే 250 మెంబర్లు 50 సెంట్లు పంచు
కుంటున్నా ఒక చెలకలో 2 అడుగులు ఎదుగుతుంది ఒక చెలకలో ½ అడుగు
కూడా ఎదగకుండా వుంది అందుచేత ఏదోఒక system క్రింద ఇదే దాని
బీదవాళ్ళకు మిగిలిన వాళ్ళతో పెళ్ళక ఉపయోగంలోకి తీసుకువచ్చే పద్ధతిమీద
చేయడానికి ఏ విధమైన అభ్యంతరం వుంటుందని అనుకోను తరువాత Social services
గురించి చాలామంది చెప్పారు Education, Doctor for every village,
Medical college, ఆయుర్వేదం, National sports and games గురించి మిత్రు
లందరూ చెప్పారు సుందరయ్యగారు లెక్కలువేసి చెప్పారు ఇంతమంది నర్సులుండాలి,
యింతమంది midwifes ఉండాలి, యింతమంది వుంటేనే అందరికీ సౌకర్యముగా
వుంటుంది, ఇంతమంది వుంటేనే మంచిది అని వారు నిరూపణచేశారు కాని నేను మనవి
చేసే విషయం యేమిటంటే ఇవి నిజంగా అభిలషించేవిషయాలు మేముచేయగలిగిందంతా

చేసే ప్రదేశంలో వున్నాం కాని యీ social services విద్య, వైద్య సంస్థలు స్థాపించడంలో వున్న difficulty ఎక్కడంటే వీటికి recurring expenditure heavy గా ఉంటుంది 50 కోట్ల రూపాయలు పెడితే చాలని వారు అన్నారు సంతోషమే కాని మేము వేసుకొన్న plan ప్రకారమే 1961 నాటికి యివాళ వున్నటువంటి deficit కొన్ని కోట్ల రూపాయలకు recurring expenditure ఎదుగుతుంది Capital investment తో పాటు recurring expenditure calculate చేసుకోకుండా అడుగు పెట్టగా ఎల్లుండి ప్రొద్దున్న సగం దూరం వెళ్ళి యీ పని మానేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది ఇప్పటికన్న deficit makeup చేసుకోడానికి ఏ పద్ధతి కానివ్వండి వారు Taxation క్రింద చెప్పారు, పేదవాళ్ల మీద ఎందుకు వేస్తారని progressive taxation వేయరాదా అని నిజమే ఒప్పుకుంటాను మా fundamental principle progressive taxation ఒక క్రొవత్తాలంటే మనం, మీరూ ఒకటే కర్ర ఎత్తేటప్పుడే తేడా వస్తుంది ఇందాకా నేను మనవి చేసినట్లు Incometax progressive tax కాదా? ఇంక progressive land tax introduce చేయమంటారు Land tax regressive tax, దానిని మార్పు తీరదు Land మీద surcharge చేయడానికి అందరూ ఏమియివ్వడుగలేరే! Regressive tax మీద progressive ఏమిటి? మొత్తం అంతా progress కావాలి అది నాయొక్క అభిప్రాయము కూడా అందుచేత మనం readjust చేసి యివాళ ఆదాయం నిలబెట్టుకొనేందుకు వీలయితే చూడాలి గోపాలరెడ్డిగారు చెప్పినట్లు కొన్ని బాధలు లేకపోలేదు Highest on those who bear it అన్న మాట చెబుతున్నాం కాని those that can bear it ఎంతమంది వున్నారు? ఆంధ్రదేశంలో ఎంతమంది incometax assessee లున్నారు? వారు యిచ్చే incometax ఎంత? ఇందులో 100 వేల పైనుంచి (who can bear the burden) ఎంతమంది వున్నారు వాళ్ళను చూచికొని readjustment of taxes ఏ standard కు వెళ్ళాలి? మిత్రుడు గోపాలరెడ్డిగారు మొన్న కూడా చెప్పారు Standardization అని వీటన్నిటినీ progressive level మీద తీసుకు రావడానికి ఏ విధమైన అభ్యంతరం ప్రభుత్వానికి వుండదని నేను మనవి చేస్తున్నాను తరువాత డిల్లీలో ఒకాయన, కూర్మయ్యగారు, నేను శాసనసభ్యుడుగా హరిజన నాయకుడుగా చెబుతున్నాను అన్నారు ఏమిటి చెప్పింది? Inter caste marriage కావాలని, బ్రాహ్మణులు, హరిజనులు పెండ్లి చేసుకోవాలని నేను అప్పుడే వారికి మనవిచేశాను అప్పుడే వారు దగ్గరవుండే ఒక హరిజనుడికి ఒక బ్రాహ్మణ యువతినిచ్చి పెళ్ళి చేయించారు వారు అనుకున్న దంతా స్వహస్తాలతోటే చేశారు గనుక కోరవలసిన అవశ్యకత ఏర్పడదని నేను కూర్మయ్యగారికి మనవి చేస్తున్నాను వారికి నేను specific గా మనవి చేస్తున్నాను నా plan లో లేను ఈ పని తరువాత ఆయుర్వేదము గురించి మనవి చేశారు ఇదివరకు నాకున్న వ్యక్తిగత అభిప్రాయమే కాకుండా state కూడా కొంత steps తీసుకోబోతున్నది ఆలోపలికే వైద్యం ప్రతిగ్రామానికి తీసుకువెళ్ళే capacity India కి 100 సంవత్సరాలకు కూడా రాదని నా నమ్మకం అందువల్ల మా యీ లంబబ్బులకు వైద్యం సంకల్పించే విషయంలో ప్రభుత్వవిధానం ఆలోచిస్తున్నదని మనవిచేస్తున్నాను ఈమధ్య తాడిపత్రివారిచే "గ్రామానివక" అని ఒక క్రొత్త పేరు ఒకటి

తీసుకువచ్చారు ఇవన్నీ కలిసిందేదో సాగర రెండు మందు లున్నాయి వాటిని వాడితే వున్న పరిస్థితి పాడయిపోతుందేమో నన్న భయంచేత వాటిని అట్టేపెట్టి యింకా ఆలోచిస్తున్నాను తరువాత మన sports and games గురించి చాలా stress తో చెప్పారు వారు చెప్పిన విషయాలు—వస్త్రాదులను గ్రామాలలో తయారుచేయాలని—మన Chief Minister గారితో మనవిచేస్తున్నాను తరువాత Medical College గురించి చెప్పారు ప్రణాళికలో రెండు Medical College లున్నవి సాధనునిర్దిష్టానికి వాళ్ళవూరికి అది వస్తుందో లేదో అని నిద్రపట్టడంలేదు నేను వారికి మనవిచేసేదేమిటంటే '0 లక్షల రూపాయలు అక్కడపెట్టి హాస్పిటలు కట్టిస్తే అన్నిసౌకర్యాలు కలుగజేస్తే అక్కడకు తీసుకువెళ్ళవలసిన అవసరం ఏర్పడుతుంది బండిని ముందకట్టి గుర్రాన్ని వెనక్కి తోలమంటేమాత్రం నడవదు ముందర వాడిగుర్రం వుంటే మాబండి దానికి కట్టడానికి అభ్యంతరం వుండదు తరువాత National Extension Services scheme, community projects ఒకదానిక్రింద ఆలోచించుకోవచ్చు Village programme క్రింద నిన్న మనవిచేశాను ఢిల్లో నేను నిన్ననే explain చేసి చెప్పాను మా ప్లానకు పునాది ఏమిటంటే 11 కోట్ల రూపాయలు పలానాపనిఅని లేదు Block grant జిల్లాకు ఒకకోటి original గా పెట్టాము 16 కోట్లు N E S schemes క్రింద వున్నాయి ప్రజల contribution తో కలిపి మొత్తం 86 కోట్ల యినా జిల్లాకు 3 కోట్ల రూపాయలు వచ్చే 5 సంవత్సరాలలోనూ ఖర్చుచేసేయత్నం వున్నది రంగాగారు చాలా stress చేశారు Village community drinking water supply, దానికి solution యిదే మార్గం అందువల్ల యీ కార్యక్రమం పూర్తిగా బలపరచుకునే యత్నం చేస్తాం అని మనవిచేస్తున్నాను

ఒకరెవరో వేయి Blocks కావాలన్నారు వేయి Blocks అసంభవము ఉద్యోగుల జీతాలు వగైరాలు ఎక్కువైపోతాయి 270 Blocks రాష్ట్రం మొత్తముమీద పెట్టేటటువంటి యత్నము నడుస్తుంది village works కు national extension schemes కు కొంచెము తేడావున్నది దానిని గుర్తించినట్లు కన్పించదు Village works అనేవి N E S లేనిచోట పెట్టబడినవి N E S లో వారికిచ్చిన allocation ని పెట్టుకుంటారు N E S లేనిచోట ఇది ఎక్కువగా ఉపయోగించే టటువంటి విషయము ఒక్కొక్కసారి 10 వేల రూపాయలు ఒక్కొక్క గ్రామానికి యిచ్చేటట్లుకూడా దీనిలో వున్నది దీనియొక్క లాభము చాలామంది తీసుకుంటున్నారు యీ మధ్యన 3-4 నెలలనుంచి, యీ ప్రభుత్వము వచ్చిన తరువాత, కొంత ప్రోత్సాహము యిచ్చారు ప్రతి జిల్లాలో పాతబాకీలుకూడా ఖర్చుపెట్టుకొనే పరిస్థితి జరుగుతుంది మొన్న ఆ మధ్యన అనంతపురము వెళ్ళితే 60 వేలే ఖర్చుపెట్టమన్నారు ఇప్పటికప్పుడే వెళ్ళి రెండు నెలలైంది ఇప్పటికప్పుడే వారు 2 లక్షల రూపాయలదాకా వారు ఖర్చుపెట్టారు అలాగే ప్రతి జిల్లాలోను వ్యవహారము జరుగుతుంది ప్రోత్సహించి ప్రజలచే శ్రమదానము కానివ్వండి సంపత్తి దానముకాని ఏదికాని ఎంత యివ్వదలచుకున్నారో అంతవరకూ యిచ్చేటట్లు తమరు అందరూ తోడ్పడండి ప్రజలు తోడ్పడకపోతే దీని వ్యవహారమేమి ముందుకు జరగదు అందువల్ల అంత ప్రత్యేకత వున్నదానిని గురించి ఆలోచిస్తాము కాని దానిని గురించి ఒక rule క్రింద alter చేయాలంటే వ్యవహారము జరుగదు గనుక progress లో తగ్గిపోతుంది మీరుగనుక $\frac{1}{3}$, $\frac{1}{4}$ అనిచెప్పి propaganda లోకి వెళ్ళితే అందరూ $\frac{1}{3}$, $\frac{1}{4}$ అంటారు వ్యవహారము నడవదు Total outlay తగ్గిపోతుంది కనుక

ఇటర్ని దృష్టిలో పెట్టుకొని పూర్ణమైన సహాయము చేయించేటందుకు సభ్యులు తోడ్పడు తారని నేను కోరుతున్నాను తర్వాత irrigation ను గురించి కొంతమంది మాట్లాడారు మేము తీసుకున్న scheme integrated scheme గోదావరి, కృష్ణా అక్కడేమో మహేంద్ర తనయ నుంచి మొదలుపెట్టి పెన్న వెళ్ళేదాకా వున్న నదులను సాధించాలనే యత్నము ఒకదాని కొకటి ఉపకరించే టటువంటి యత్నము చేసేటటువంటి Plan చిట్ట చివరకు ముందుకు తీసుకువెళ్ళడానికి వీలుంటుంది ధాన్యము ఎక్కువ పండించితే ధరలు పడిపోతాయి అంటూరు సుందరయ్యగారు సూచించినట్లు తినగల్గినటువంటి వారికి ఇంకా ఖాళీవుంది పొట్టలో దానిని మనము పూర్తిచేయాలి ఎక్కువ పండించిన పంటవల్ల అందువల్ల నష్టము ఖర్చుకాదు అనే భయము లేదు అందులో stabilisation of agricultural prices మనము చేయాలి అయితే మవాండ్లు ధరవరలు పడిపోతూ వున్నాయని ఉపన్యాసాలు చెప్పవద్దని నాకోర్కె ఇంకా పడుతాయి పులి పులి అని చెప్పకండి ఎవరికినీ నిజంగా అంతపడిపోలేదు రు 18 12-0 రేటు గవర్నమెంటుయిచ్చింది ఇప్పుడు 1 రూపాయ పైచిలుకువుంది Fall అయినమాట నిజమే కాని precipitous fall కాదు వరి లెక్క దేనిమీద వేస్తారు మొన్న ఎవరో చెప్పారు 35 రూపాయలకు అమ్ముకున్నారట దీనిలో రు 17 లు సగమే Black Market నుlegalise చేసి country యొక్క progress ను దానిమీద base చేస్తామంటే దానికి నేను ఏమి సమాధానము చెప్పాలో నాకే తెలియదు

Sri L LAKSHMANA DAS — ధాన్యపు ధరలు పంటకాలములో 12 రూపాయలు మొదలు 14, 14 రూపాయల వరకూ చాలావరకు అమ్మడమైంది అందు చేత గవర్నమెంటు రేటు రు 17 లు మన గవర్నమెంటు తరవున కాని ఇంకొక విధంగా కాని కొనే పద్ధతి లేనికారణముచేత 12 రూపాయలు, 13 రూపాయలు యివ్వడమువల్ల చాలావరకు పడిపోయింది జరిగిన యదార్థమిది

The Hon Sri K VENKATA RAO — నాకో సంగతి తెలుసు నాకు కొంత ధాన్యము పండుతుంది నేను అమ్ముకుంటూ వుంటాను అందులో మా యింటిలో జనము తక్కువ నాయొక్క అవసరమేమిటన్నట్లయితే యీధర ఎప్పుడు కూడా జనవరి, ఫిబ్రవరి, మార్చి మాసాలలో పడిపోక తీరదు ఇప్పుడు 35 రూపాయలుంటే అప్పుడు 25 రూపాయలుంటుంది 18 రూపాయలుంటే 15 రూపాయలుంటుంది ఆ మూడు మాసములు Harvest కాగానే prices తగ్గక తప్పదు కాని ఆ పరిస్థితులలో కూడా యీ ఏడు బాగా పడిపోయినట్లయితే ఏమి చేశారు Distress pockets కు Government కొంటామని చెప్పారు తర్వాత ఇంకొక విషయము కూడా ఆలోచించుకోండి ఇప్పుడు ధర ఎందుకు పెరిగింది ఎవరికైనా తెలుసా ? Simple గారడి గవర్నమెంటేమిటో deficit finance inject చేస్తున్నారు రేపు మార్చిలోపల 300 కోట్ల రూపాయలు చేర్చాలి ఎక్కడా production లో పనిలేకుండా deficit finance అంటే అది వచ్చే పంచవర్ష ప్రణాళికలో వేయి కోట్ల రూపాయలు తేవా Inject చేయబోతున్నారు Inflationary tendency తగ్గి పోవాలంటే ధరవరలు తప్పకుండా raise చేస్తుంది There is no other go అందు చేత ప్రస్తుతమే పెరగకండి నేనిపుడు చెప్పేది ధరలు తగ్గించవద్దని ధరలు stabilise

చేయమని నేనే చెప్పుచున్నాను ధరలు పడిపోయాయి పడిపోయాయంటే 1935 లెక్కలతో పోల్చుకొంటె పడిపోయినాయి black market rate కు మిగిలింది precipitous fall కాదు మన Co operative market Co operative credit ను గురించి ఇప్పుడే చెప్పివేస్తాను Credit ను గురించి తీసుకొచ్చాను ఇప్పుడు కొత్తగా rural credit surveyer యొక్క report గనుక చూచినట్లయితే దానిలో ఏముందన్నట్లయితే ware houses కేమి Reserve Bank of India undertake చేసింది Co operative capital 50% Reserve Bank యిస్తానని చెప్పుతుంది ఈ రెండు గనుక వచ్చినట్లయితే యీ ధరవరల స్థిరీకరణకు ధరల యొక్క తోడ్పాటుకు ఎక్కువగా వస్తుందని కూడా నేను మనవిచేస్తున్నాను Railways ను గురించి కొంతమంది చెప్పారు ఈ Discussion అంతా ఇలాగే Government of India కు వెళ్ళిపోతుంది నాకింకా 5 నిమిషాలకాలమున్నది మిగిలిన విషయాలు మనవిచేస్తున్నాను The plan is only extension of departmental activities అని కూర్మయ్యగారు చెప్పారు చాల అన్యాయము కూర్మయ్యగారికి అప్పుడప్పుడు ఇక్కడ నిద్రలోనుంచి మెలకువ వస్తే ఆలాగే కనబడుతూ వుంటుంది కాని దేశములో జరిగేటటువంటి వ్యవహారము గనుక వారు సరిగా చూచినట్లయితే ఈ Plan లో వున్న పేజీలన్నీ చదివినట్లయితే వచ్చే 2 వ భాగాన్ని కూడా వారు పరిశీలించినట్లయితే Extension scheme కాదని ఇది పునాది సిద్ధాంతాలతో వేయబడిన మార్గమని దానికి ఆయనకూడా పార్టీ మెంబరుగా గర్వపడడానికి బదులు ఈరకముగా విమర్శించడము మంచిది కాదని నేను మనవిచేస్తున్నాను తర్వాత ఎలమంచారెడ్డిగారు ఇదంతా మాకు lack of self confidence వల్ల ఇవన్నీ మొదలుపెట్టారన్నారు కాని మాకు lack of self confidence ఏమిలేదు మా నెహ్రూగారికి dynamic energy వుంది ఆయనమీద మనకు confidence ఎన్నాళ్ళుంటుందో అంతకాలం యీ దేశము dynamic గా పనిచేస్తుంది కాని ఇంకొకటి పనిచేయదు నెహ్రూగారు సరియైన మార్గాన్ని అవలంభించారో ఒక పోనీ యితరదేశాలు నెహ్రూమార్గాన్ని అనుసరించడానికి యత్నాలు జరుగుతున్నాయో కాని నెహ్రూవెళ్ళి ఇతరదేశాలను ఆశ్రయించి నూతనమార్గాలను ఇతరదేశములనుంచి తెచ్చుకోవలసిన పరిస్థితి భారతదేశములో లేదనిచెప్పి నేను మనవిచేస్తున్నాను తర్వాత taxation ను గురించి ఒకటి రెండు విషయాలు చెప్పారు కాలవ్యవధి లేదు ఇంకొక సందర్భములో ఎప్పుడైనా మనవిచేస్తాను Soviet system of taxation ఎలా వుందో ఆ విషయాన్నికూడా మనము రెండు parallel lines లో చూచినట్లయితే మనము ఆట్టే అంత విచారపడవలసిన అవసరముండదు తర్వాత వారియొక్క గట్టివిమర్శన ఏమిటంటే ప్రజల సహకారాన్ని కాంగ్రెసుగవర్నమెంటు తెచ్చుకోలేదని యీ వేళ ఆయన అనుక్క చెప్పడము చాలా హాస్యాస్పదముగా వుంది ఇంకా 4 నెలలు కాలేదు అందుచేత దానినిగురించి అంత mild గా constructive గా విమర్శచేసినారు కనుక ఒక్కసలహా చెప్పారనే విషయాన్ని నేను తీసికొని తీవ్రమైన విమర్శలోనికి వెళ్లదను నాకుకూడా శక్యముగ వుండదు చరిత్ర ఎరిగినవారందరికి వారంతటవారికే తోస్తుంది తర్వాత రత్నసభాపతిగారొక్కరు election మాట ఎత్తారు యింకమంది discuss చేస్తే నేను మరచిపోయాను ఇంకా నాలుగేండ్లు వుంటే మాకింకదయ్యా అబాధ అని నేనంటే కాదు 1957 లో Parliament elections వస్తున్నాయి అందుకోసము చేస్తున్నారన్నారు యీ భయము వారికుండాలిగాని మాకేమిలేదు ఆంధ్రదేశంలో

మొన్న General elections లో నెగ్గడమే కాకుండా యీనాడు Election పెట్టితే యిద్దరు కాంగ్రెస్ candidates un opposed బూరుగుపూడిలో ఎలక్షన్ పెట్టితే యీ నెల్లూరు లో పోటీపెట్టి అందరూ కలిస్తే మాకీమాటు success ఎవరు చెదరకలసింది P S P యే ఆలోచించుకోవలసియున్నది Election కు వెదిరేస్థితి కాంగ్రెస్ కు ఇప్పుడు కాదు కదా కొన్ని సంవత్సరాల వరకు కూడా లేదని నేను వారికి మనవి చేస్తున్నాను అందుకోసము తయారుచేయలేదు యీ Plan కాని మమ్ములను ప్రజలు పంపించారు గనుక వాండ్ల పొట్టలు నింపడానికి వాండ్లకు గుడ్డలు యివ్వడానికి వాండ్లకు సౌకర్యము కలుగజేసే ఉద్దేశముతోటే మేము యీ Plan వేశాము కాని వాండ్లయొక్క ఓట్ల సంపాదన దృష్టిలో పెట్టుకొని చేసినపని కాదని నేను వారికి సవినయముగా మనవి చేస్తున్నాను తర్వాత తెలుగు కాపీలు యివ్వవలసిందని సుబ్బారావుగారు suggest చేశారు తప్పనిసరిగా యీ Plan కొంచెము finalise అవగానే తప్పకుండా తెలుగు కాపీలు వేయడానికి, వారికియిస్తాము Publicity propaganda కు కూడా provision పెట్టాము ఇంకోదానిని ఒకరూపములో తీసుకువెళ్ళాలి First publicity కి వచ్చి చూడాలని మిమ్ములను కోరాను Secretariat కు వెళ్ళి ఆ plan అంతా చూడవలసిందని కోరుతున్నాను స్త్రీలపైన అభిమానము తక్కువని అమ్మన్నరాజాగారన్నారు ఎక్కువని సుబ్బారావుగారు చెప్పారు సుబ్బారావుగారు ఎంత శ్రద్ధతీసుకొన్నారో నాకు తెలియదు కాని మా Plan మాత్రము కావలసినంత శ్రద్ధ స్త్రీలపైన తీసుకుంటుంది మొట్టమొదట ఒకటి రెండు provisions ఎందుచేత చేర్చలేదంటే Social Welfare Board వారి report రాలేదు వారు తర్వాత పంపించారు 75 లక్షలు మేము యిస్తాము, 25 లక్షలు మీరు పెట్టుకోమంటే last minute లో cabinet లో దానిని add చేశాము దానినిబట్టి స్త్రీలమీదవున్నటువంటి అభిమానమెంతో మీరు తెలుసుకోవచ్చునని నేను మనవిచేస్తున్నాను అంటే వారి అభ్యుదయము కొరకు అని అంటున్నాను తర్వాత మిగిలిన విషయాలు administrative set up వాటన్నిటినిగురించి మాట్లాడారు

Sri S BRAHMAYYA — ఒక్క విషయమండి ఆర్థికంగా వెనుకబడిన జాతులకు ఉచిత విద్యావసతులు కలుగజేయమని చాలమంది మాట్లాడారు వానినిగురించి ఏమైనా చెప్పతారా?

The Hon Sri K VENKATA RAO అధ్యక్షా బ్రహ్మయ్యగారైనా దానిని గురించి మాట్లాడారు ఐతే వున్న బాధ ఏమిటంటే యీ యొక్క పర్యవసానము క్రింద ఎక్కువ లాభము వచ్చింది బ్రహ్మం గారికి మాకున్నూ మాకు అక్షయ పాత్ర చేతిలోవుంది ఆయనకు ఇంకా టీకవాండ్లెవరైన వున్నారో నాకు తెలియదు ఏదైన స్వతంత్ర దేశములో విద్యావ్యాప్తి కావలసియున్నది బాగా వెనుకబడినవారికి ముందర స్థానమిస్తున్నాము తర్వాత మిగిలిన వారికేమో వస్తుంది అందరికి కూడా చదువు చెప్పించాలి compulsory గా చెప్పించాలనే ఉద్దేశము వుంది కాని ఇటువంటి లోపాలకు కాలవ్యవధి తప్ప ఇంకొకటి వుండదని చెప్పి నేను మనవి చేస్తున్నాను ఆఖరు విషయము మళ్ళీ చెప్పతున్నాను యీ వేళ మనమందరమూ కలసి ప్రజల దగ్గరకు వెళ్ళి ప్రజలు savings నిలువ పెట్టుకొని ఆ వచ్చిన రూపాయలో పేద వచ్చినా పంటలో 10 వచ్చినా వేయిలో వందవచ్చినా లక్షలో 75 వేలు వచ్చినా

దేశానికి investment కోసము అనేకరకాలుగా యిస్తే కాని యీ పని కొనసాగదు. అందువల్ల రేపు House adjourn పోతుంది గనుక మళ్ళీ సమావేశమయ్యే లోపల దేశముముందు పెట్టినటువంటి 2½ కోట్ల రూపాయలు శ్రమలేకుండా ప్రభుత్వ ఒత్తిడి లేకుండా మన యొక్క సహాయముచేత గనుక పనులు చేయ గలిగిన పరిస్థితిని కల్పించడానికి తోడ్పడ వలసిందని కోరుతున్నాను అది యీ plan విజయానికి తోడ్పడుతుందని నేనుమళ్ళీ తిరిగి మీ అందరికీ మనవిచేస్తూ ఇప్పుడు 6 గంటలయింది గనుక ఈ motion కు యిన్నాళ్ళనుండీ వచ్చిన విమర్శనకు నా కృతజ్ఞత చెప్తూ మీ రిచ్చిన సలహాలను పాటించి చేస్తామని యిందుకు అందరియొక్క దేశముయొక్క అదృష్టాన్నిబట్టి మనకు వచ్చేటటువంటి మొత్తము ఎంతో ఢిల్లీలో నిర్ణయమైన తరువాత తిరిగి తమతో సంభాషించే అవకాశము నాకు కలుగుతుందని ఆశిస్తున్నాను ఈవేళ యిచ్చినటువంటి సలహాలకు సహకారానికి చాలమంది సభ్యులు యిచ్చినటువంటి ప్రశంసకు కృతజ్ఞత తెలుపుకొంటూ నేను విరమిస్తున్నాను

Mr SPEAKER —Discussion on the Second Five Year Plan is closed We now proceed to the next item in the agenda

## *III Half - hour Debate Re*
## DISTRIBUTION OF BANJAR LANDS

Sri P SUNDARAYYA — అధ్యక్షా! ఈ బంజరు భూములను గురించి అరగంట చర్చను కోరడంలో ప్రభుత్వముయొక్క నిర్ణయాలు కొన్ని ఒక దానికొకటి సందర్భశుద్ధిగా లేకుండా ఉండడం అనేకవేలమంది బీద ప్రజానీకానికి చాలా నష్టం కలుగుతున్నది కాబట్టి ఈ నెల రోజులలో మంత్రి వర్గానికి తెలియజేస్తూ వచ్చినప్పటికీ కూడా - ఆఖరు రోజున ప్రార్థన, విజ్ఞప్తి ఏమైనా చేసినా కొత్తయినా మనస్సు మార్చుకొని తిరిగి తమ పద్ధతిని పునరాలోచిస్తారేమోనని ఆశతోటి దీనికి అరగంట debate ను కోరాను ఇదివరకే ఆక్రమణలోయున్న భూములను ఇక ముందు రాజకీయ బాధితులకు ఇవ్వకూడదని మేము నిర్ణయించుకున్నామని చెప్పి మంత్రి వర్గం చెప్పారు, అంటే ఇదివరకే సాగు చేసుకుంటూయున్న శివాయి జమాదార్లనుగాని, బంజరుదార్లను గాని తొలగించి రాజకీయబాధితులకు ఆ భూములు ఇవ్వడం అనే పద్ధతి సరికాదు ఇక ముందు అట్లా చెయ్యం అని చెప్పారు దానికి మేము సంతోషించాం

ఇదివరకు సాగుచేసుకొంటున్న వాళ్ళను తొలగించకుండా ఉంటే సంతోషమే కాని ఇదివరలో ప్రశ్నోత్తరాల సందర్భములో ఇకముందు ఇవ్వబోయే రాజకీయ బాధితులకు మాత్రం ఇది వర్తిస్తుంది గాని, మేము అధికారానికి రాకముందు ఉన్న ప్రభుత్వము రాజకీయ బాధితులకు ఇదివరకే సాగుచేసుకొంటున్న బంజరుదార్ల భూము

లను గనుక ఇచ్చి ఉండినట్లయితే వాటిని అమలు జరుపుతాము, బంజరుదార్లను తొలగించి ఆ భూములను రాజకీయ బాధితులకు ఇస్తామని సెలవిచ్చారు దాని అర్థంఏమిటి ఎక్కడ అయితే మీరు రాజకీయబాధితులకు ఇచ్చేదానికొరకు ఇదివరకే సాగుచేసుకొంటున్న వాళ్ళను భూమినుంచి తొలగించడం న్యాయంకాదు అనే నిర్ణయం తీసుకొన్నారో, ఇంతకుముందు ఉన్న ప్రభుత్వము చేసినటువంటి పద్ధతి న్యాయము కాదు అని మీరు అనుకొన్నప్పుడు, దాన్ని మీరు పునరాలోచించి, సాగుచేసుకొంటున్న వాళ్ళను తొలగించకుండా ఉంటే దానికోసం మీ ఆర్డరు వెనకకు కూడ వర్తింపచేయడం న్యాయమని భావిస్తున్నాను రాంపేరులో 590 మంది రాజకీయ బాధితుల కొరకు ఇప్పటికే 1500 మందిని తొలగించామని, ఇక 2700 మందిని తొలగించబోతామని చెప్పడం ఏరీతిగా న్యాయమో మరొక పర్యాయం ఆలోచించమని కోరుతున్నాను అక్కడ ఉన్నటువంటి భూమి అంతా, 8 వేలు చిల్లర ఎకరాలు దాంట్లో 5 వేలు, 6 వేలు ఎకరాలు సాగుచేస్తూ ఉండవచ్చును కనుక ఈ అయిదువందల మందికి కావాలన్నట్లయితే, వారు సాగుచేయనటువంటి రెండు వేల ఎకరాలలో ఇవ్వండి లేదా ఆంధ్రదేశములో ఇంకా చాలాస్థలాలున్నాయి అక్కడ వారికిఇవ్వండి రాంపేరు భూమి ప్రాంతములవాళ్ళు కాబట్టి అక్కడవారికి ఇవ్వడం పైవారికి కష్టమనుకుంటే అదేమీ కాదు ఇంకా అనేకచోట్లనుండివచ్చిన వాళ్ళకేకాకుండా అందులో భూమివున్న వాళ్ళకుకూడ ఇస్తామని అంటున్నారు ఇది ఏవిధంగా న్యాయమో మరొకమాటు ఆలోచించమని కోరుచున్నాను అంతేకాదు మీరు ఎట్లాగో భూసంస్కరణలను తీసుకురాబోతున్నామని అంటున్నారు కనుక భూములున్న రాజకీయబాధితులను కొంచెము ఆగండి అని చెప్పి భూసంస్కరణలు తెచ్చినతరువాత ఇంకొకచోట వారికి ఇవ్వవచ్చును భూములు వున్న వారికికూడ ఇంత తొందరఎందుకు అంటాను ఈ రోజు భూమి లేనటువంటి బంజరుదార్లు బాధపడుతుంటే వారికిలేకుండా భూమివున్న రాజకీయబాధితులకు ఇవ్వవలసిన అవసరమేమిటి ? పోనీ వారికి ఇవ్వాలని అనుకొంటే ఇంకొకచోట వారికి భూమి చూపించండి లేకపోతే ఇంకొకసంవత్సరం ఆగమనిచెప్పండి

అదేవిధంగా చెరువు లోతట్టులలో సాగుచేసుకొంటున్న భూములగురించి అనేక petitions వస్తున్నాయి ముఖ్యంగా కోవూరు, నెల్లూరు తాలూకాలలో full tank level గా ఉన్నటువంటి భాగాలు వున్నాయి చెడిపోయి నటువంటి చెరువులు కొన్ని ఉన్నాయి వీటిని సాగుకు ఉపయోగించుకొన్నప్పటికి కూడాను full tank level గా ఉన్న ప్రాంతాలున్నాయి. ఈరకంగా 10, 15 సంవత్సరాలుగా సాగు చేస్తున్నటువంటి భూముల నుంచి ఈ సంవత్సరమే తొలగించవలసిన అవసరమేమో నాకు అర్థం కావటంలేదు ఇంతకాలం 15 ఏళ్ళు వ్యవసాయానికి ఎవ్వరు అడ్డము రాకుండా ఉంటున్నప్పుడు ఇప్పుడే యేమి అవసరము వచ్చింది ? కనుక భూమి లేనటువంటివాళ్ళకు మొదట భూమిని చూపించవలసిందని మా ఉద్దేశము ఇప్పుడు భూసంస్కరణలు మార్చి నెలలో తెస్తున్నాము అంటున్నారు కాబట్టి భూమిలేనటువంటివాళ్ళకు సదుపాయాలుకల్గించడమే మాయొక్క ఆశయముఅంటున్నారు కాబట్టి మీరు భూసంస్కరణలు చేసేంతవరకు వాళ్ళను ఆగండని చెప్పవచ్చు తరువాత వాళ్ళకు ఇంకెక్కడో చూపించవచ్చు ఒక నెల్లూరు, కావలి తాలూకాలలోనే దాదాపు 15 వేల కుటుంబాలను ఆకస్మికంగా పంటసమయం వచ్చేటప్పటికి మీరు

చెరువులలోకి వెళ్ళకూడదని చెప్పి వాళ్ళను అక్కడ చేరనీయడంలేదు ఇకముందు వారిని చెరువులలోకి చేరనీయదలచుకొంటే వచ్చేసంవత్సరంనుంచి ఆవిధంగా చేసి ఈ లోపల వాళ్ళకు భూమిసదుపాయాలు చూపించండి అంతేకాని 15 సంవత్సరములనుంచి చేసుకొంటున్నవాళ్ళను ఈరోజు అకస్మాత్తుగా తొలగించడం న్యాయంకాదు అది ధర్మంకాదు అందుచేత ఈ విషయాన్ని తిరిగి ఆలోచించవలసిందని కోరుతున్నాను మేము ఈ రోజు కోరేది వారికి శాశ్వతంగా పట్టాలు ఇస్తారా లేదా అని కాదు, కాని రోజూ సాగుచేస్తున్నటువంటివాళ్ళను మీరు తొలగించవద్దుఅని, నిజంగా రాజకీయబాధితులకు ఇవ్వవలసిందని అనుకుంటే, మీరు భూసంస్కరణలు చేసేంతవరకు ఒక సంవత్సరం ఆగండని చెప్పండి లేకపోతే ఇంకోచోట ఇవ్వండి అంతేకాని వాళ్ళకుసురు వీళ్ళకు తగలనివ్వకండి ఈ కారణంగా రాజకీయబాధితులకు వీళ్ళకు దెబ్బలాట పెట్టవసరంలేదు భూములు ఉన్నవాళ్ళకు ఇంకొకసారి వాయిదావేయండి ఈమాత్రం ఆలోచించడానికి కోసం మరల దీనిని పునరాలోచించండని మంత్రివర్గాన్ని, ముఖ్యంగా శాసనసభ్యులను కోరుతున్నాను ఎందుకనగా, ఏది ఏమైనాసరే దీనిని అమలుజరుపుతాము అని వారు అనేకసార్లు చెప్పారు ఇది ప్రతిష్టకు సంబంధించిన సమస్యకాదు అని చెప్పుచున్నాను ఎన్నికలలో ఎక్కువవుంది మీలో మీ ప్రతిష్టను ఇదివరకే రుజువుచేసుకున్నారు మీయొక్క ప్రతిష్ట, మీయొక్క అధికారము ఈవిధంగా వాళ్ళను తొలగించడంలో లేదు కాని భూములు లేనివాళ్ళకు ఇంకొక సదుపాయము చూపమని అంతవరకు వాళ్ళను అదే విధంగా ఉంచి రాజకీయబాధితులను ఇంకొక 6 నెలలో ఒక సంవత్సరమో ఆగండి అనిచెప్పి ఆవిధంగా చేయడంలోనే మీయొక్క ప్రతిష్ట రుజువుఅవుతుంది ఆవిధంగా చేసినప్పుడే మీయొక్క అధికారాన్ని సద్వినియోగం చేసినవారు కాగలరు కాబట్టి మరొకపర్యాయము ఇది ప్రతిష్టకు సంబంధించిన సమస్యగా తీసుకోకుంటే సాగుచేసుకొన్నటువంటి పేదలను, ఆ భూములనుండి కమ్యూనిటీ భూములు గానివ్వండి, చెరువులు కానివ్వండి, లంకభూములు కానివ్వండి వాటినుంచి తొలగించకుండా చేయవలెనని మంత్రివర్గాన్ని కోరుతున్నాను

Mr SPEAKER — I would like to suggest that other hon Members who want to participate in this debate, may quote some points for answer by the Minister instead of making a speech, because many hon Members want to participate The time at our disposal is only ten minutes for all the members to participate Therefore please post some points, so that the Minister may answer

Sri VAVILALA GOPALAKRISHNAYYA — అధ్యక్షా ! ఈ బంజర్ల సమస్య వేలలోపుగా, జమాబంది కూడా కాబోతున్నది కాబట్టి, యింత వరకు రైతులమీద చాలామట్టుకు penalties వేశారు వాటి విషయములో అన్నీ ఒకే block rate పద్ధతిలో అంటే సాధారణంగా వసూలుచేసే పద్ధతిమీద ప్రభుత్వము వసూలుచేస్తే, రైతులకు అన్యాయం జరుగుతుంది ప్రభుత్వము తరువాత details లోకి వెళ్ళి, ఏవిధంగానైనా విచారించి dispose of చేయవచ్చునుగాని, అంతవరకూ రైతులు occupation లోనే ఉండేటట్లు, ఆ బంజర్లు మాత్రము చేర్చటానికి వీలు

వుండేటట్లు చేయమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను ప్రభుత్వము ఆవిధంగా అవకాశము గలిగించుమని కోరుతున్నాను

Sri K PUNNAYYA — అధ్యక్షా, శ్రీకాకుళం జిల్లాలో వున్న బంజర్ల విషయం చెబుతున్నాను ఆ జిల్లాలో యిదివరకు estates abolition పూర్వము నుండి కూడా కొన్ని వేల యకరాలు బంజర్లుగా వుంటున్నవి అలాంటి బంజర్లు హరిజనులకు కనీసము 1% కూడా లభించక పోవడము చాలా శోచనీయముగా వున్నది దీనికి కారణము యేమిటంటే landless poor కు బంజరు భూములు ఇవ్వమని మొన్నటి జి ఓ లో వున్నది ఆ జి ఓ ను ఆధారము చేసుకొని landless poor అనే సాకుతో జిల్లాలో వున్న అన్ని వర్గాలవారు కూడా landless poor అని పరిగణించ బడుతున్నారు అట్టి సందర్భములో హరిజనులు దరఖాస్తు పెట్టుకున్నప్పటికిని సవర్ణ హిందువులు landless అనే సాకుతో బలవంతముగా హరిజనులను బంజర్లలోకి రానివ్వడము లేదు అందువల్ల సవర్ణ హిందువులే ఆక్రమించు కొనివున్నారు దీనికి తోడుగా రెవిన్యూ అధికారులు రెవెన్యూ ఇన్స్పెక్టరు, డిప్యూటీ తహశీల్దారు గ్రామమునసబు, కర్ణాలు వారందరునూ సవర్ణ హిందువులకే సహాయము చేస్తూ వస్తూ యున్నారు దీనివల్ల హరిజనులకు బంజర్లు దక్కకుండా అన్యాయము జరుగుచున్నది ఈ ముఠాలో యెస్టేటు మేనేజర్లు, విజయనగరం యెస్టేటు మేనేజరుతో సహా మద్దతు యిస్తున్నారు కాబట్టి ఈ అధికార్లందరు ఒకరితో నొకరు లాలూచీ అయి హరిజనులకు పొత్తుగా బంజర్లు లేకుండా చేస్తున్నారు ప్రభుత్వము యీ విషయము గమనించి land assignment విషయములో హరిజనులకే preference యిచ్చేటట్లు ఏర్పాటు చేయాలి వారిపైన వేసిన penalties కూడా రద్దు చేయాలని కోరుతూ విరమిస్తున్నాను

Sri PRAGADA KOTAIAH — అధ్యక్షా, ఈ బంజర్లను పంపకము చేయడములో కొంత కాలయాపన జరిగినందువల్ల చాలా విషమఫలితాలకు దారి తీస్తున్నది ప్రధానంగా లంచగొండితనము విపరీతముగా పెరిగిపోయింది మామూలు రెవిన్యూ డిపార్టుమెంటు ద్వారానే ఈ పంపకము పూర్తి చేయాలంటే బహుశ ఈ పంపకము యింకను 25 సంవత్సరాలకైనను పరిష్కారము కాకపోవచ్చు అందువల్ల ఈ బంజర్ల పంపిణీ విషయములో ప్రతి జిల్లాలోనూ ప్రత్యేకంగా ఒక డిప్యూటీ కలెక్టరును అవసరమైన సిబ్బందిని వేసి ఈ సమస్యను పరిష్కారము చేయడం అత్యవసరమని చెబుతున్నారు ప్రభుత్వము ఈ విషయములో కొంత శ్రద్ధవహించి ఈ సమస్యను త్వరలో పరిష్కరించటానికి పూనుకోవాలని నా అభ్యర్థన

ఇక రెండవది యేమిటంటే రాజకీయ బాధితులకు భూములు కేటాయించడమనేది ఖాయము చేయాలి అనే ఆలోచన మాత్రమే కాకుండా, రాజకీయబాధితులకు provisional గా assignment చేసే నాటికే ఆ భూములపై అప్పటినుంచి యిప్పటి వరకూ సాగుచేసు కుంటూ స్వాధీనములో వుంచుకున్న వారిని బయటకు నెట్టే విధానాన్ని అవలంబించవద్దని ప్రభుత్వాన్ని కోరుతున్నాను అలాంటి విధానాన్ని ఈ రోజున రొంపేట భూముల పంపకములో అవలంబించక పోవడమువల్ల దాదాపు ప్రభుత్వము యిచ్చిన లెక్కల ప్రకారము అయినా కూడా 2,734 మంది బైటకు నెట్టివేయ బడు తున్నారు, ఈ భూములన్నీ కలిసి సుమారు 10 మైళ్ళ విస్తీర్ణము వున్నది దీనివల్ల

ఏర్పడే దుష్ఫలితాలను ప్రభుత్వము గమనించాలి అందువల్ల ఈ విషయాలు ప్రభుత్వము పునఃపరిశీలన చేయటానికి ఆలస్యము అవుతుంటే ప్రభుత్వము యిచ్చిన ఆర్డరుకు stay యిచ్చి అక్కడఅనవసరమైన ఆందోళనకు తావులేకుండా చేయమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను

Sri A C SUBBA REDDI — అధ్యక్షా ! సుందరయ్యగారు నెల్లూరు, కోవ్వూరు తాలూకాలలో చెరువులవిషయము చెప్పారు దానినిగురించి నాకు తెలిసినంత వరకు వారు చెప్పింది తప్పు, అబద్ధము అని నేను చెప్పుచున్నాను నేను రాజకీయ బాధితులకు భూమి పంచే కమిటీలో ఒక మెంబరుగా వున్నాను అప్పుడు గవర్నమెంటు ఆర్డర్సుకూడా ఆ పిటీషను పెట్టుకునేప్పటికి ఎవరుఅయినా ఆక్యుపై చేసివుంటే ఆభూములు రాజకీయబాధితులకు ఇవ్వకూడదు అని ఆర్డర్సుకూడా వున్నాయి అందువల్ల పిటీషను పెట్టుకోడానికి పూర్వము ఎవరుఅయినా ఆక్యుపై చేసుకొని వుంటే ఆ భూములు రాజకీయబాధితులకు యివ్వలేదు ఇచ్చినారనిచెప్పి నెల్లూరు యం యల్ ఏ లు ఎవరు అయినా చెబుతరా అని అడుగుతున్నాను సుందరయ్యగారు ఇటీవల నెల్లూరులో లేరు కాబట్టి బహుశః కోవూరుతాలూకాలో కొడవలూరు సమాచారము వారికి ఎవరుఅయినా చెప్పివుండవచ్చును కొడవలూరు తాలూకాలో ఈ రాజకీయబాధితులు అర్జీలు పెట్టుకునేప్పటికి 70 ఎకరాలు కట్టుకు హరిజనులు కల్టివేటు చేస్తున్నారు దానిని గవర్నమెంటుకువ్రాసి ఆ చెరువును కాంటూరుబండింగు చేయించి తరువాత రాజకీయబాధితులకు ఇవ్వాలని మేము అంతా అర్జీలు పెట్టించి గవర్నమెంటునుండి ఉత్తర్వుతెప్పించుకొనే లోపల బహుశః యించుమించు ఒక ముప్పాతిక భాగము ఆక్యుపై చేశారు గవర్నమెంటు ఉత్తర్వుతీసుకొని దిగుదామని కాంగ్రెసువారు ఉన్నారు గవర్నమెంటు ఉత్తర్వు తీసుకుంటే కాంగ్రెసువాళ్లకు వస్తాయేమోనని కమ్యూనిస్టులు ముందర మీరుపోయి దున్నుకోండరా అని వీరలను లేవగొట్టినారు మేము ఇచ్చినట్లు లెఖ్ఖ అవుతుంది అని బహుశః కమ్యూనిస్టుసోదరులు వారిని పంపినారు

Sri B SANKARAIAH — పాయింట్ ఆఫ్ ఆర్డరు సుందరయ్యగారు నెల్లూరు, కోవూరు తాలూకాలలో అక్కడ రాజకీయ బాధితులకు సంబంధించిన భూములుగురించి చెప్పారు అందువల్ల వారు చెప్పనటువంటిది చెబుతున్నారు

Mr SPEAKER —తరువాత మీరు చెప్పవచ్చును

Sri A C SUBBA REDDI — నెల్లూరుజిల్లాలో రాజకీయబాధితులకు పిటీషనులు పెట్టకొనక పూర్వము ఎవరుఅయినా పేదప్రజానీకము ఆక్యుపైచేసుకొన్న ల్యాండు తీసుకొన్నారని ఎవరుఅయినాగాని నాకు చెబితే అది నిజము అనిచెప్పి నమ్మగలను అటువంటిది ఎక్కడకూడా, నెల్లూరు జిల్లాలోకూడా చేసివుండరని అనుకుంటున్నాను

Sri N C SESHADRI — రాయదుర్గము తాలూకాలో ఇదివరకు లాండు అక్విజిషను స్టాఫ్ వున్నది లాండు లెస్ పూరుకు, ల్యాండులు డిస్ట్రిబ్యూటు చేస్తున్నారు అయితే యీ సంవత్సరము మార్చి నెలలో ఆ స్టాఫ్ను డిస్బాండు చేసినారు ఎందుకు చేసినారు అని అడిగితే ఇది ఫ్రాంకెస్టు affected area అన్నారు అయితే రాయదుర్గమ

తాలూకాలో 100 గ్రామాలలో 21 గ్రామాలు మాత్రమే ప్రాజెక్టు ఎఫెక్టెడ్ గ్రామాలు మిగతా 79 గ్రామాలు ప్రాజెక్టు ఎఫెక్టెడ్ గ్రామాలు కాదు కాబట్టి ప్రాజెక్టు ఎఫెక్టెడ్ గ్రామాలలో మాత్రము లాండు ఎసైన్‌మెంటు జరుగదా ?

Sri C SUBBARAYUDU — ఈ ప్రాజెక్టు ఎఫెక్టెడ్ ఏరియా అనేదానికి నిర్వచనము అర్థముకాకుండా చాలామంది ఉన్నారు ఇది ఇన్‌వెస్టిగేషను అయినటువంటి స్కీములకు లేక ఆ ప్రాజెక్టు క్రింద వచ్చేటటువంటి భూములకు అంతటికి అన్వయిస్తుందా లేకపోతే ఎగ్జిక్యూషను శాంక్షను అయి టువంటివారికి అన్వయిస్తుందా లేకపోతే ఫలాని పీరియడునుంచి ఫలానపీరియడు లోపుగా ఇన్‌వెస్టిగేషను గాకుండానే స్కోప్ ఆఫ్ ది ప్రాజెక్టు క్రింద వచ్చినట్లుగా జమకడతారా అనే విషయంలో చాలా సందేహాలు కలుగుతున్నవి

సుందరయ్యగారు యఫ్ టి లెవెల్‌లో కొన్ని ప్రదేశాలలో వుండేటటువంటి వారి భూములు అన్నీకూడా ఇవ్వవచ్చునన్నారు అది మహాప్రమాదముగా వుంటుంది ఎందుకంటే ఏచెరువుఅయినాగాని దాని జీవితము 100, 200 యేండ్లగాని ఇన్ని సంవత్సరములు అని వుంటుంది తరువాత క్రొత్త యఫ్ యల్ పి క్రైటుచేయవలసిన అవసరము అనేది వుంటుంది ఆయకట్టుకూడా పెద్ద దిబ్బలగుతుంది.

రాజకీయబాధితులకు ఇచ్చిన భూములు మూడుసంవత్సరముల లోపుగా దానిని సాగుచేసుకోకపోయినట్లయితే వాటిని తిరిగి ప్రభుత్వము తీసుకోవడము అవసరము అటువంటి భూములు చాలా ఉన్నట్లున్నాయి దానినిగురించి పూర్తిగా ఇన్‌ఫర్మేషను గవర్నమెంటు తెప్పించుకోవాలి

Sri M NAGI REDDI — అధ్యక్షా ! రివిన్యూ మంత్రిగారు ఇక్కడ చెప్పే సందర్భములో గాని డిబేట్‌లో గాని ఈ రెండోపేరు భూముల విషయములో రెండు రకాలుగా చెప్పడము జరిగింది మొట్టమొదట రాజకీయ బాధితులకు assign చేయక ముందు ఎవరి భుక్తంలోనైనా యీ భూములు ఉన్నట్లుగా B forms కాని ఆక్రమణలు గాని ఉన్నట్లయితే వాటి జోలికి మేము పోము అని చెప్పారు కాని మొన్న సుందరయ్యగారు తరచి తరచి అడిగిన సందర్భములో మేము రాకముందు గత ప్రభుత్వము కనుక assign చేయకముందు ఒకవేళ వాళ్ళక్రింద B forms అంటూ ఆక్రమణలు ఉన్నప్పటికిన్నీ అది గత ప్రభుత్వము కనుక రాజకీయ బాధితులకు యివ్వడం జరిగినట్లయితే వాటిజోలికి మాత్రము మేముపోము, మా హయాములో assign చేయకముందు ఏమైనా భూములు ఆక్రమణలు ఉన్నట్లయిన వాటిజోలికి పోము అన్నారు ఇది చాలా అన్యాయమైన విషయమని మనవిచేస్తున్నాను గత ప్రభుత్వము చేసిన అనేక orders కాదని ఇప్పుడు క్రొత్త orders వస్తున్నాయి రాజకీయ బాధితులకు భూములు పంచడం అన్నది టి.సి.వేళారు అయినప్పటికి ఎవరి ఆధీనములో ఉన్నప్పటికి గత ప్రభుత్వము చేసిన వాటిని పరిశీలించి అవి వాళ్ళకు యివ్వాలి ఇక రాజకీయబాధితుల విషయములో కూడా ఒక విధయం పాటించాలని కోరుతున్నాను సాధారణముగా 2½ ఎకరములు మాగాణి గాని, 5 ఎకరములు మెట్టగాని ఉన్నవాళ్ళకు భూమిని పంపిణీ చేసేటప్పుడు అలా ఉంచాలని మీరు అంటున్నారు కనుక రాజకీయ బాధితుల విషయములో కూడా

ఆవిధముగా పాటించాలి తరువాత ప్రాజెక్టు క్రింద భూము సందర్భములో 30, 40 సం॥లు నుంచి సాగుచేస్తున్న భూములు అనేకము ఉన్నవి పట్టాలు యివ్వాలని చేయాలని అడంగులలో కలెక్టరు R D O, Tahsildar లు వ్రాస్తున్నప్పటికి గ్రామ ఉద్యోగస్తులు ఇబ్బందుల వల్ల పట్టాలు యివ్వకుండా ఉన్నవి కూడా ఉన్నవి కాబట్టి కనీసము ఏగర 2, 3 సం॥ల నుంచి లేక ఎప్పుడో ఆక్రమించిన వాటిని పట్టా భూములుగా చేయాలని మనవిచేయుచున్నాను ఆదే విధముగా చెఱువులు భూముల విషయములో కూడా చాలా వాటిలో నీళ్ళు ఉండవు వాటిని సాగుచేస్తున్నారు చెఱువులని లెక్కలలో ఉంటుంది చెరువు బాగుచేయండి నీళ్ళు ఉండేటట్లు చేసినచో నీరు అట్లాగే వదలిపెట్టారు అంతేకాని అట్లా బాగుచేసి (చెరువులను) సంతకాలము ప్రభుత్వము తీసుకోనంతకాలము వాటిని వారు సాగుచేసుకోడానికి ఎలాంటి ఆక్షేపణ లేకుండా ఉండవలసినదని మనవిచేస్తూ యీ 4 points మంత్రిగారు దృష్టిలో పెట్టుకో వలసినదిగా కోరుచున్నాను

Sri E AYYAPU REDDI — నందికొట్కూరుతాలూకా రాగులు చెరవు క్రింద బంజరుభూములు పంచిపెట్టారు కాని ధరనిర్ణయము ఎకరము రు 1200/ చొ॥ నిర్ణయించి 20 వంతులప్రకారము వసూలుచేసేపద్ధతిని ఈ సంవత్సరమే మొదటివంతుగా నిర్ణయముచేశారు యితరప్రాంతాలలోఉన్న భూములధర 1200/-లేదు ఎకరము 4,00/ 500/ కంటె ఎక్కువ చేయదు అంతేకాకుండా భూములు తీసుకొన్నవారు ఈ సంవత్స రమే సాగుకు అప్పులు తీసుకొని బాధపడుతున్నారు కనుక వంతులు చెల్లించడానికి ఇంకా 4 సం॥లు గాని 11 సం॥లు గాని వ్యవధి యివ్వవలసినదిగా మంత్రిగారిని కోరు చున్నాను అదేవిధముగా యితరచెరువులక్రింద ఉన్నటువంటి భూములుకూడా పంపకము చేయవలసినదిగా మంత్రిగారిని కోరుతున్నాను

Sri B SANKARAIAH — అధ్యక్షా! ఇప్పుడు కొత్త point ఈ చెరువుల విషయములో సుబ్బారాయుడుగారు చెప్పారు ముఖ్యముగా డెల్టాలో నదీజలములను ఉన్న చెరువులు వర్షము మీద ఆధారపడిన చెరువులు ఉన్నవి ఇప్పుడు క్రిష్ణాగోదావరి డెల్టా లలో ఇటువంటి చెరువులు చాలవరకు బీదలకు ఇచ్చారు ఆవిధముగా కొవ్వూరు నెల్లూరు తాలూకాలలో డెల్టాక్రిందవున్న భూములు 10 వేలకు యివ్వమని సుందరయ్యగారు చెప్పారు అనేక గ్రామములలో చెరువులు లేకుండా కాలువలద్వారా సాగుఅవుతూ ఉన్నవి ఈ చెఱువులలో నీరు 15 రోజులు ఉండవు అటువంటి సమయ ములో ఈ చెఱువులు కొన్ని ఎత్తివేయాలని కొంతమంది engineers సూచిస్తూ వచ్చారు అటువంటి ప్రాంతములను ఏకగ్రీవంగా కూలీలకు సాగుచేసుకోమన్నారు కాని మొన్న elections లో ఏదైనా తగాదాలు వచ్చినప్పుడు కొంతమంది petitions పెట్టుచున్నారు అటువంటిది చూడకుండా ఒక సంవత్సరము ఈ చెఱువు సాగుచేసు కొనండి అని మరుసటి సంవత్సరం వరల మళ్ళీ చేయండిఅంటే వారు చాలా ఇబ్బంది పడుచున్నారు కనుక సాగుచేసుకొంటున్న వారిని తొలగించకుండా ఉండాలని నేను ప్రభుత్వమును కోరుచున్నాను

Sri N VENKAIAH — డెల్టా గ్రామాలలో కూడా మురుగునీరు యితర నీరు యెక్కువగా వున్నప్పుడు చెఱువులో నిలువచేసుకుని అధికంగా సాగు చేయడానికి

అవకాశం వుంటుంది అలాంటప్పుడు చెఱువులు పట్టా యివ్వడం మంచిదికాదు అనుమతి లేకుండా దురాక్రమణ చేసిన పరిస్థితులున్నాయి అలాంటి దురాక్రమణ దారులను తొలగించడం అవసరం ఎంతో కాలంనుంచి సాగుకు అనుమతితో 1912 సంవత్సరాల నుంచీ సాగు చేస్తున్న వారికి తప్పని సరిగా యివ్వాలి జమీందారీ area లో ప్రభుత్వ విధానం ఏదో స్పష్టంగా చెప్పవలసినదిగా కోరుతున్నాను

Mr SPEAKER —Let all the difficulties mentioned in the form of questions be explained now so that the Minister may answer them

Sri V KURMAYYA — అధ్యక్షా, irrigation tanks మినహాయించి non irrgation tanks, abandoned tank అలా న్నటువంటి భూములు యివ్వాలని నా కోరిక

The Hon Sri K CHANDRAMOULI — అధ్యక్ష మహాశయా! ప్రప్రథమంలో గౌరవనీయ సభ్యులకు ఒక విషయం మనవిచేస్తున్నాను భూములపంపిణీ విషయములో రాజకీయబాధితులకు కొన్నియెండ్లు యితరుల కొరకు కానింది ప్రతిష్ఠ కొరకు అధికారము వున్నది అనే దురుద్దేశంతో ప్రభుత్వం చేస్తున్నది అనే అభిప్రాయం కలిగి వుండడం చాల అన్యాయం అని మనవి చేస్తున్నాను ఆ ఉద్దేశ్యము ప్రభుత్వానికి లేదని నేను యిదివరకు ఒక పర్యాయం మనవిచేశాను ఇది ప్రతిష్ఠకోసం కాదు ఉన్న వ్యవహారాన్ని బట్టి పరిస్థితులనుబట్టి యిదివరకు వస్తున్న టువంటి వ్యవహారాలనుబట్టి మనం ఎట్లా చేస్తేబాగుంటుంది అనేటటువంటి విధానాన్ని బట్టి యిప్పుడు ఈ భూముల పంపకం కూడా జరుగుతుంది ఇంకో విషయంకూడా జరుగవలసియున్నది చెఱువులు, డొంకలు, వుంతలు వీటిని గురించి కొత్తగా ఈ ప్రభుత్వం తెచ్చింది, యిదివరకు లేనేలేదు అని అనుకోడం చాలా పొరపాటు గ్రామ సమిష్టి కళ్యాణంకొరకు వుంటూవుండి వచ్చిన కొన్ని చోట్ల, సుందరయ్యగారు చెప్పినట్లు దౌర్జన్యంగానే కొన్ని చోట్ల పెళ్ళి కొట్టడం అదీ చేస్తే అవన్నీ అవిధంగానే వుండాలి, గ్రామ చెఱువులు ఉండకూడదు, డొంకలు వుండకూడదు అనేటటువంటి policy యీ ప్రభుత్వానిది కాదు అది న్యాయమైన policy కాదు ఒక వ్యక్తికొరకు యిద్దరు వ్యక్తులకొరకు గ్రామాన్నంతా నాశనం చేయడం మంచిదికాదు అని మనవిచేస్తున్నాను ముఖ్యంగా యిప్పుడు political sufferers క్రింద ఒక మాట మనవి చేస్తాను ఈ political sufferers భూముల విషయంలో యిదివరకు చాలసార్లు చెప్పాను ఇది ఒక పార్టీకి సంబంధించిన విషయం కాదు దేశంకొరకు త్యాగంచేసి ఆ రోజుల లో Civil Disobedience Movement లో పాల్గొన్నటువంటి వారందరూ కూడా విద్య కోల్పోయి లేకపోతే ఆర్థికంగా కష్టపడి కుటుంబపోషణకు చాలా చిక్కులు పడుతున్నటువంటి పరిస్థితులలో general దృష్టితో ఆనాడు భూమి యిస్తాంఅని ఒక నిర్ణయం జరిగింది దానికి దురదృష్టవశాత్తు అనేకకారణాలవల్ల, కొంతమంది వ్యక్తుల obstruction వల్ల ప్రభుత్వ policy కొంతవరకు మారడంవల్ల కానిండి, ఏ కారణాలవల్లనైనా కానిండి, కొన్ని చిక్కులు వచ్చి అపోహలకు కారణంఅవడానికి ఏర్పాటుజరిగింది అంతేగాని రాజకీయ బాధితులకు కట్టు

ల్ట్రాలకే వుద్దేశంకాదు ఈసమస్యను సాధ్యమైనంతత్వరలో పరిష్కరించినట్లయితే యితర పేదవాళ్ళను భూమి పంచిపెట్టడానికి ఆటంకము తొలగుతుంది అనే వుద్దేశ్యంతోనూ పరిష్కారం చేద్దామనే వుద్దేశ్యముతోనూ ప్రభుత్వమున్నది అందువల్ల నేను మనవిచేసేది యేమిటంటే యిది కేవలం ఎవరో పేదవాళ్లకు భూములు లేకుండా చేయాలని పేదవాళ్లకు భూములు యివ్వకుండా వుందామని గాని లేక సుందరయ్యగారు చెప్పినట్లు 50 ఏండ్లనుంచి సాగుచేస్తుంటే అది గ్రామసముదాయానికి అడ్డంగా లేకపోయినట్లయితే వారిది తీసేసి యింకొకరికియిద్దామని కాదు అది గ్రామ సమిష్టిలాభానికి ఎవరైనా చేస్తుంటే ఆ సమస్యను ఉదారంగా చూడండి తరువాత రెండోపేరు భూముల విషయం చెప్పి నా ఉపన్యాసం ముగిస్తాను రెండోపేరుభూముల విషయంలో ముఖ్యంగా project affected lands వున్నాయి ఏవి project affected lands అంటే దానికి కొన్ని నిర్వచనాలు చేసేవున్నాయి ఆ areaలు అన్నీకూడా ఫలానా అని నిర్ణయించుకొని మిగతావి యివ్వడం జరుగుతున్నది దీంట్లోకూడా రాజకీయబాధితులకు ప్రత్యేకమయినటువంటి సౌకర్యం ఎక్కడా ఏమీ చూపించడంలేదు ఇతరులకు ఏ terms అవ్వ యిస్తున్నవో అవే రాజకీయబాధితులకుకూడా అన్వయిస్తున్నాయి వారికి కొంత చౌకగా భూములుయివ్వడం యిటువంటివేమీ లేదు పోతే ముఖ్యంగా ఒక ప్రధానమైనటువంటిది లేవదీశారు ఇదివరకు assign చేసినటువంటి భూములు అంటే శివాయి జమీదార్లు అంటే వాళ్ళను వెళ్ళగొట్టి assign చేశారు కాబట్టి, ఇప్పుడు వాళ్ళందరినీ వెళ్ళగొట్టడం అంటే దీనికి ఒక హద్దుగాని, అంతంగాని వుండదు ఇవాళరోజున ఒక ప్రశ్న వేస్తున్నాను ఒకసారి assign చేసినతరువాత ఎందుకువచ్చి ఆక్రమణచేశారు? ఆ ఆక్రమణదారులను వెళ్లగొడతారా, వెళ్లగొట్టేటట్టు చేయగలరా అని అడుగుతున్నాను

An hon Member — ఉద్రేకపడకండి

The Hon Sri K CHANDRAMOULI — నేను ఉద్రేకపడటంలేదు రెచ్చగొట్టడం మనకు చేతనయిందిగాని వారిని యివాళ మీరుఎవరూకూడా వెళ్లగొట్టలేరు

Sri PILLALAMARRI VENKATESWARLU — మీరు ఎవరికో assign చేశారు కాని ఇతరులు సాగుచేసుకున్నప్పటికీ ప్రభుత్వం assign చేసినప్పటికిని వాండ్లు సాగులోంచి పోలేదు ఈనాడు కూడా possession వాండ్ల క్రిందనే వుంది అలాంటి వాండ్ల విషయమేమి ?

The Hon Sri K CHANDRAMOULI — సాగులోనుంచి పోయిన వాండ్లను కూడా తీసుకొచ్చి పెట్టారు వాండ్లనన్ని మీరు తేల్చగలరా అంటాను మీరు అవన్నీ తీసివేయగలరా? కాబట్టి నేను మనవిచేసేది ఏమిటంటే ఈసమస్య ఏదో ఒక విధంగా పరిష్కారమయ్యేటట్లు చూడవలసియున్నది, ఎక్కడో ఒక hard case వుంటే దానివల్ల ఇదిగో ఇటువంటి బాధ జరుగుతుంది ఇన్ని ఏండ్లుగ ఇవన్నీ వున్నాయి అనేది ఏమైనవుంటే నేను ఆలోచిస్తానని కూడా ఇదివరలో ఈ House లో రెండు మూడు సారులు కూడ మనవిచేశాను అందువల్ల మరొకసారి మనవిచేసేదేమిటంటే, ప్రతి దఫా రాజకీయబాధితులకు ఏదో కట్టి పెడుతున్నారని ఇదంతా ఏదో పార్టీ దృష్టితో చేస్తున్నారని ఏ కొద్దిమందికో కట్టబెట్టి చూస్తున్నారని, వీరవాండ్లే మేము

(Sri K Chandramouli) [4th August 1955

ప్రతి దఫా చెప్పతూ రాజకీయబాధితులను అడ్డముపెట్టవద్దు రాజకీయబాధితులు వారంతట వాండ్లు కోరినటువంటి భూములుకాదు ఇదివరకే ఒక policy అమలు జరుగుతున్నది వారంతా కూడా దేశభక్తితో దేశముకొరకు సేవచేశారు కాబట్టి విధానాన్ని continue చేస్తున్నారు కాబట్టి ప్రతిదఫా పేదవాండ్లకు భూములు పంచిపెట్టే విషయములో రాజకీయబాధితుల పేరుతేవద్దని నేను మనవిచేస్తున్నాను అందువలన ఏదైన వ్యక్తిగతమైనటువంటి కష్టాలుంటే చెరువుల విషయములోగాని ఇంకా యితరవిషయాలలోగాని అక్రమవిషయములోగాని కష్టాలుంటే తప్పకుండా విచారించుతాను అసలు అక్రమం అనేది చాల తప్పని నేను మొదటినుంచి చెప్పుతున్నాను అక్రమంగా లేకుంటే సక్రమమైనటువంటి విధానముతో వాండ్లకు భూములు యిస్తామనికూడా నేనుచెప్పుచున్నాను అటువంటివిషయములున్నప్పుడు గౌరవనీయసభ్యులుకూడా అవన్నీ విశాలదృష్టితో కొంచెము ఉదారమైనదృష్టితో ఆలోచించవలసిందనికోరుతున్నాను ప్రభుత్వము పేదవారికి సహాయముచేయాలనే దృష్టితో నేవున్నది కాంగ్రెస్ సంస్థ ఎప్పుడుకూడా బీదలకు సహాయము చేయాలనే దృష్టితోనే వున్నది కాబట్టి ఆదృష్టితో మనమందరము కలసి పనిచేయడానికి ఎక్కడైనా ఒకకష్టముంటే దానిని తొలగించడానికి పరస్పర సహకారముతో పనిచేస్తామని మనవిచేస్తున్నాను ఈ విషయములో మీరీనాడు చర్చకువచ్చారు మరిఏమైన ఒకటి రెండు points చెప్పడానికి అవకాశము లేకపోతే ఇంకఏమైన వుంటే తప్పకుండా విశాలమైన దృష్టితో ఆలోచిస్తామని మరొకసారి సభ్యులకు ప్రభుత్వము తరఫున హామీయిస్తున్నాను ఈ విషయములో చర్చజరగడం చాలసంతోషకరమైన విషయము ప్రభుత్వముతరఫున యింతకన్నా నేను ఎక్కువ చెప్పదలచుకోలేదు

Mr SPEAKER — Discussion is now closed To morrow the House will meet at 11 a m and not at 10 a. m as stated in the agenda

The House then adjourned

—

# APPENDIX I

[ Vide answer to Question No 340 at page 130 Supra ]

L A Q No 340, (705) PUT IN BY SRI P GOPALU REDDI, M L A

*Answer to clause (b)*

## I GENERAL QUALIFICATIONS

No person shall be eligible for appointment to the service unless —

(i) he is a citizen of India,

(ii) his character and antecedents are such as to qualify him for such appointment, and

(iii) he is of sound health and active habits and free from any bodily defect or infirmity unfitting him for such appointment

## II SPECIAL QUALIFICATIONS

| *Method of appointment* (1) | *Qualifications* (2) |
|---|---|
| *Direct recruitment* | (1) Must not have completed 32 years of age, |
| | (2) Must be practising as an Advocate of the High Court, |
| | (3) Must have been actually practising in courts of civil or criminal jurisdiction in India for a period of not less than 3 years, and |
| | (4) Must have — |
| | (i) passed the third class Language Test (Viva voce Parts A B and D) in Telugu, or |
| | (ii) passed the B A degree examination with Telugu as an optional subject, or |
| | (iii) passed the Intermediate Examination including composition in Telugu, |

| *Method of appointment* (1) | *Qualifications* (2) |
|---|---|
| | Provided that this qualification shall not be necessary if the condidate is certified by a District Judge or the Registrar of the High Court that he can talk fluently in Telugu and can read and write in Telugu |
| Transfer | (1) Must not have completed 45 years of age<br>(2) Must have passed the examination prescribed by the High Court for Advocates,<br>Provided that persons who have passed the examination prescribed by the High Court at Madras for advocates and held before the 5th July 1954 shall be deemed to possess the qualification specified in this item and<br>(3) Must have—<br>(i) Passed the third class Language [viva voce Parts A, B and D] in Telugu, or<br>(ii) Passed the B A degree examination with Telugu as an optional subject<br>(iii) passed the Intermediate Examination including composition in Telugu<br>Provided that this qualification shall not be necessary if the candidate is certified by a District Judge or the Registrar of the High Court that he can talk fluently in Telugu and can read and write in Telugu |

X X X

*for Deputy Secretary to Government*

## APPENDIX II

[*Vide*—Answer to Starred Question No 105 S No 346 at page 140 by

SRI S VEMAYYA, M L A ]

The First Five Year Plan for Power Projects approved by the Planning Commission provides for lump sum amount for rural extension schemes While sanctioning these extension schemes, specific approval of the Planning Commission is not being obtained

In 1954-55 the Planning Commisson has approved, as an addition to the schemes in the First Five Year Plan eleven electricity schemes proposed by this Government for expansion of power facilities for increasing employment opportunities The particulars of these schemes are as follows —

| *Serial number* (1) | *Name of Scheme* (2) | *Estimated cost* (3) RS (IN LAKHS) | *Village served* (4) |
|---|---|---|---|
| 1 | Additional diesel set for Visakhapatnam | 4 655 | |
| 2 | Tekkali diesel scheme | 0 960 | Tekkali |
| 3 | Sompet diesel scheme | 2 700 rising to 3 581 | Sompeta |
| 4 | Araku Valley diesel scheme | 0 945 rising to 3 143 | Araku Colony |
| 5 | Bhadrachalam diesel scheme | 2 343 rising to 3 732 | Bhadrachalam |
| 6 | Rentachintala diesel scheme | 2 205 rising to 3 040 | Rentachintala |
| 7 | Kadiri diesel scheme | 5 808 rising to 12 507 | Kadiri |
| 8 | Extension of supply to Biccavolu area | 17 392 | (1) Dwarapudi, (2) Anaparti, (3) Komaripalem (4) Pandalapaka, (5) Konkuduru (6) Vedurupaka (7) Gollalamamidada (8) Ulapalli, (9) Biccavolu, (10) Peda |

| *Serial number* (1) | *Name of Scheme* (2) | *Estimate cost* (3) RS (IN LAKHS) | *Village served* (4) |
|---|---|---|---|
| 8 | Fxtension of supply to Biccavolu area (*Cont*) | | brahmadevam, (11) Medapadu, (12) Vetlapalem, (13) Balabha drapuram, (14) Savaram, (15) Koppavaram, (16) Polamuru (17) Mahendravada (18) Raya varam, (19) Arthamuru (20) Ramavaram, (21) Kuthukuluru, (22) Someswaram, (23) Pulu gurta (24) Matsavaram and (25) Pedaparti |
| 9 | Extension of supply to Nandigama Jagga yyapeta area | 27 775 | (1) Gollapudi (2) Guntapalli (3) Kondapalli, (4) Nandigama, (5) Jaggayyapeta, (6) Kanchka cherla, (7) Chilakallu (8) Pena ganchiprolu, (9) Jayantipuram, (10) Muktheswaram |
| 10 | Extension of supply to Tiruvur Vissannapeta firkas | 28 370 rising to 43 020 | [1] Akkapalem [2] Anjeyapuram, [3] Anumullaka, [4] Arlapadu, [5] Chennavaram, [6] Chinko mira [7] Pedakomira, [8] Ammi reddipalem, [9] Chintatalanarva [10] Chintalapadu, [11] Chittela, [12] Bendirlapadu, [13] Erra madu, [14] Erakapadu, [15] Ga mapalagudem(E) [16] Gampala gudem (W), [17] Gesvid, [18] Gollapadu [19] Kanumur, [20] Kakarla, [21] Kekilampadu, [22] Kommireddipalli, [23] Katha palli, [24] Laxmipuram [25] Lingala [26] Meeluru, [27] Mun kuntala, [28] Mustikunta, [29] Nadimi Tiruvur, [30] Pata Tiru vur, [31] Rajupeta, [32] Pengo lanu [33] Peddavaram, [34] Polisettipalle [35] Kothuru, [36] Rajavaram [37] Ramanpalem, [38] Rolupadu, [39] Sobbala, [40] Tunikipadu, [41] Utukuru, [42] Vallampeta, [43] Vama Kuntla [44] Rajugudem, [45] Vinagadapa, [46] Atlaparagada, [47] Kodur, [48] Kondur, [49] |

| Serial number (1) | Name of Scheme (2) | Estimated cost (3) RS (IN LAKHS) | Village served (4) |
|---|---|---|---|
| 10 | Extension of apply to Tiruvur Vissannapeta firkas (cont) | | Kambhapadu [50] Merepilli and [51] Gunachintalapalli |
| 11 | Extension of supply to Pakala Damalcheruvu Vayalpad area | 34 670 rising to 43 850 | [1] Rompecherla [2] Chinnagoti gallu, [3] Kalakeri [4] Pattegada [5] Koilakonda [6] Pileru [7] Gangaboyanapalli [8] Chinta parti [9] Chintalavaripalli [10] Vittalam [11] Vayalpad [12] Gundalapalli [13] Polakola, [14] Tallagundalapalli, [15] Ayirala, [16] Damalcheruvu, [17] Moga rla [18] Vallevedu, [19] Kotha peta [20] Mangalampeta [21] Kalluru, [22] Pulicherla, [23] Sadum and [24] Chinnathippa samudram |

*Statement showing the number of Agricultural Farms in the State and the number of coolies maintained by each one*—cont

| Serial No | Name of Agricultural Research station. | Place | Number of coolies at each station — Permanent — Number employed — Skilled | Unskilled | Monthly wages — Skilled | Unskilled | Number of coolies at each station — Casual — Average number of coolies (Total) employed in the month — Males | Females | Boys |
|---|---|---|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
| | | | | | RS A P | RS A P | | | |
| 12 | Rice Research station | Buchireddipalem | | 5 | | 31 0 0 to 34 8 0 | 73 | 220 | 40 |
| 13 | Panagal Demonstration Farm | Kalhasti | | 4 | | 31 8 0 | 192 | 165 | 33 |
| 14 | Zonal Nucleus Seed Farm | Vayalpad | | | | | 47 | 260 | 30 |
| 15 | Zonal Nucleus Seed Farm | Adoni | | | | | 83 | 164 | 8 |
| 16 | Agricultural Research Station | Nandyal | | 12 | | 33 0 0 | 109 | 349 | 116 |
| 17 | Mungari Cotton Improvement Scheme | Adoni | | | | | 73 | 213 | 23 |
| 18 | Regional Oil seeds Research Station | Anantapur | I | 2 | 30 0 0 | 28 0 0 | 93 | 147 | |
| 19A | Fruit Research Station(general section) | Kodur | II | 12 | 34 0 0 | 26 0 0 | 383 | 414 | 110 |
| 19B | New Root Stock trials | Kodur | | | | | 384 | 182 | 128 |
| 20 | Agricultural Demonstration *cum* Research Farm Yemmiganur | Yemmiganur | | | | Newly sanctiond | | | |
| 21 | Demonstration *cum*-Exploratory Farm | Rampachodavarm | | | | Newly sanctiond | | | |
| 22 | Model Orchard cum Nursery | Giddalore | | 3 | | 28 | 187 | 7 | |

*Note* — No temporary coolies are maintained at the Agricultural Research Station on monthly wages basis and only casual labour is engaged as and when necessary on daily wages

## APPENDIX IV

[Vide answer to unstarred question No 30 (963) asked by Sri M Rajeswara Rao at the meeting of the Legislative Assembly held on 4th August 1955, page 166 supra ]

STATEMENT

| Name of the Taluk | Number of house sites provided for Harijans and other eligible communities in each of the taluks of Krishna district up to 31st March 1955 | No of applications for assignment of house sites in each of the taluks of Krishna district pending with the Collector of Krishna on 31st March 1955 |
|---|---|---|
| (1) | (2) | (3) |
| Bandar | 479 | 3 |
| Gudivada | 1,663 | 24 |
| Kaikalur | 998 | 6 |
| Divi | 1,849 | 13 |
| Vijayavada | 846 | 17 |
| Gannavaram | 413 | 33 |
| Nandigama | 503 | 15 |
| Tiruvur | | 7 |
| Nuzvid | | 9 |
| Total | 6,751 | 127 |